ప్రచురణ 3

# కమ్యూనిస్టులూ - సాహిత్యం

[సాహిత్య వ్యాస సంపుటి]



రచయిత

కొత్తపల్లి రంగారావు

విద్యాప్రవీణ, భాషాప్రవీణ



★

అరుణోదయ ప్రచురణలు

# అంకితం

సర్వతోముఖ ప్రతిభాశాలి, మార్క్సిస్టు మహామహోపాధ్యాయుడు
ప్రపంచ శ్రామిక జననేత, అంతర్జాతీయ కమ్యూనిస్టునాయకుడు
సుస్థిర శాంతిదాత, శాశ్వత కీర్తికాయుడు
పూర్ణ మానవుడు

**కామ్రేడ్ స్టాలిన్**

దివ్య స్మృతులకు

# ఈ సంపుటిలో

౨



3



౪

# అవతారిక

ఈ సంపుటిలో ఉన్నవి రెండు సారస్వత వ్యాసాలు. మొదటిది "కమ్యూనిస్టులూ-సాహిత్యం" అనేది; రెండోది "కళా శాస్త్ర వాఙ్మయాలూ-కమ్యూనిజం" అనేదిన్నీ.

'కమ్యూనిస్టులూ-సాహిత్యం' అనేదాంట్లో విశిష్టమైన జాతీయ అంతర్జాతీయ పరిస్థితుల్లో భారత కమ్యూనిస్టుపార్టీ అవతరణ, వివిధ దశల్లో ప్రత్యేక జాతీయ అంతర్జాతీయ పరిస్థితుల్లో అది అనుసరించిన ఆర్థిక రాజకీయ విధానాలూ దిఙ్మాత్రంగా సూచిస్తూ, ముఖ్యంగా ఆయా విధానాలను ఆంధ్రదేశ పీడిత ప్రజానీకంలో కమ్యూనిస్టులూ, తదితర అభ్యుదయ కాములూ ఆచరణలో పెట్టే సందర్భంలో తమకు కలిగిన వివిధ అనుభవాలనూ, భావాలనూ ప్రజల ఆశలూ, ఆశయాలతో బాటు వస్తువుగాగొని కమ్యూనిస్టులు, అభ్యుదయ కాములైన తదితర రచయితలచే వ్రాయబడిన వివిధ రచనలు రేఖామాత్రంగా పర్యాలోకి(చి)ంచబడ్డాయి. గత ఇరవై సంవత్సరాల్లో ఆధునిక ఆంధ్రవాఙ్మయంలో కలిగిన విప్లవ పరిణామాలు చిత్రించబడ్డాయి. ముఖ్యలోపాలు పేర్కొని పరిష్కారమార్గాలు సూచించబడ్డాయి.

'కళాశాస్త్ర వాఙ్మయాలూ - కమ్యూనిజం' అనే రెండో వ్యాసంలో కళాశాస్త్ర వాఙ్మయాలకూ జీవితానికీ, కమ్యూనిజానికీ వాటికీగల పారస్పరిక సంబంధాలు స్పష్టీకరించబడ్డాయి. వివిధ ప్రాకృతిక సాంఘిక సమస్యల సమగ్రపరిష్కారానికి మార్క్సిజం (గతితార్కిక చారిత్రక భౌతికవాదం) ఏ విధంగా సక్రమమైన మార్గమో ఇది వివరిస్తుంది.

ముఖ్యంగా వాఙ్మయం జీవితం సిద్ధాంతాచరణలవలె ఎలా అవినాభావ సంబంధంగలవో ఈ వ్యాసాలు వివరిస్తాయి. అంతేకాదు. ఇంకా సూటిగా చెప్పాలంటే రాజకీయోద్యమంతో కళాసాహిత్యోద్యమం ఎలా పెనవేసుకొని ఉండేదీ, ఒకదాని అభివృద్ధి కింకొకటి ఎలా దోహదంచేసుకొనేదీ ఇవి తేటతెల్లం చేస్తాయి.

## సామ్యవాద వాస్తవికత

కమ్యూనిస్టు రచనా సిద్ధాంతం సామ్యవాద వాస్తవికత. అది నేడు బీజప్రాయంగా నేటి మన ఆంధ్రసాహిత్యంలోని గతితార్కిక చారిత్రక భౌతికవాద దృక్పథంలో స్వతంత్ర ప్రజాతంత్ర వర్గపోరాట రూపాల్లో ప్రస్ఫుటమవుతుంది. నూతన ప్రజాతంత్ర వాస్తవికతారూపమైన అంకురావస్థలోనూ దానిని చూడగలం. మొత్తంమీద కొన్ని లోపాలున్నప్పటికీ, ఇంకా పరిపక్వత సాధించవలసిఉన్నా, ఇంతకు ముందున్న బూర్జువా ప్రజాతంత్ర వాస్తవికతతోగూడిన సాహిత్యంలో మాదిరిగా గాక ఈ సాహిత్యంలో కళావిలువలతోబాటు రాజకీయ విద్యావిలువలు తాత్విక నైతిక వాస్తవికతాది తదితర విలువలన్నీ చేరి చాలవరకు సర్వతోముఖమై, సమగ్రమై, అత్యంత సారవంతమై ఒప్పారుతోంది. విప్లవకరమై వెలుగొందుతోంది. వ్యక్తిపరిధుల్లోంచి సంఘపు సరిహద్దుల్లోకి పరిక్రమిస్తోంది. అంతేకాదు. ఇది బూర్జువా క్షీణ సారస్వతంవలె కేవలం జడప్రాయమూ, నిష్క్రియాత్మకంకాదు. నీరసమూ, నిర్జీవమూకాదు. కేవల నిరాశా నిస్పృహల కెంత మాత్రం తావీయదు. నూతన ప్రజాతంత్ర జీవితంకోసం ప్రజలు

వీరోచితంగాజరిపే పోరాటాల్ని ప్రతిబింబిస్తూ సృజనాత్మకమైసరి క్రొత్తజీవితాన్నిరూపొందిస్తూఅభివృద్ధిమార్గంలోపురోగమిస్తోంది. నూతన వాస్తవికతకు విప్లవకాల్పనికతకు వారధి నిర్మించుకొంది.

అలాగే ఇప్పటివరకు వచ్చిన కళారూపాల్లో 'సినిమా'యే సమగ్రతమమని పేర్కొనవచ్చు. కారణం: శబ్దం, రూపం, శిల్పం, సంకేతం మొ. అన్నిటికీ తావలమై, కళాజగత్తుకూ, భౌతిక జగత్తుకూ కూడలియై అది వివిధ స్థలకాలపాత్రల్నీ, దృశ్యాల్నీ ఏకత్రితమొనర్చి, వివిధ కళాశాస్త్రవేత్తల నొకచో చేర్చి హృదయాల్ని తీర్చిదిద్దడానికి కారణమవుతుంది. నవలలో నాటకంలో ఉన్న విశిష్ట గుణాలతోబాటు అనేక శాస్త్రీయ సాధనాల్ని, విధానాల్ని అది ఉపయోగించుకోగలుగుతుంది. అంచేత కళారూపాలన్నిటిల్లోకి శక్తివంతమైన ఆయుధమని చెప్ప వచ్చు.అంతేకాదు. శాస్త్రవిద్యాదిరంగాల్లోగూడ దానిప్రభావం అద్భుతం. వివిధ రంగాల్లో పార్టీ కావిస్తున్న కృషికీ, ఉద్యమా లకూ వర్గపోరాటాలకూ నిర్బంధ వ్యతిరేక సాయుధ పోరాటా లకూఫలితంగా సినిమారంగంలోగూడా అభివృద్ధికాముకులైన ఫిలిం నిర్మాతలు వివిధభాషల్లో అనేకచిత్రాలుతీశారు. రైతుబిడ్డ, ద్రోహి, షాహుకారు, పల్లెటూరిపిల్ల, సర్వాధికారి, పల్లెటూరు, ధర్తీ కే లాల్ (హిందీ) హంలోగ్ (హిందీ), ది గ్రేట్ డిక్టేటర్ (ఇంగ్లీషు), బెర్లిన్‌పతనం (ఇంగ్లీషు), స్టాలిన్‌గ్రాడ్ యుద్ధం (ఇంగ్లీషు) మొ.

## సమగ్ర విధానం

నేటి మన సామాజిక వ్యవస్థలోనూ, జీవితంలోనూ వేరూనిఉన్న అసమగ్రతను, అసంతృప్తినీ, వాని పరిష్కార

మార్గాలను, ఇతర ప్రధాన లోపాలను ఈ రెండువ్యాసాలు ఎత్తి చూపుతాయి. ముఖ్యంగా ఆర్థిక రాజకీయ రంగాలతోబాటు సాహిత్య విద్యారంగాల్లో ఉన్న లోపాలకు తగిన పరిష్కార మార్గాలు చూపుతాయి. నేటి మన విద్యావిధానంలో ఉన్న అతి ప్రధానలోపం అభివృద్ధికరమైన వివిధ ప్రజాఉద్యమాలతోనూ, సిద్ధాంతాలతోనూ అది సంబంధం లేకుండా ఉండడమే. ప్రజల ఆర్థిక రాజకీయ సాంఘిక సాంస్కృతికోద్యమాలతో సన్నిహిత సంబంధం ఏర్పరచుకొన్నప్పుడే ఏరంగంలోనైనా అభివృద్ధి చేకూరుతుంది. ప్రజలనుంచి నాయకులు, నాయకులనుంచి ప్రజలు నేర్చుకోవడం జరుగుతున్నప్పుడే, ఆ విధానంగానీ, ఆ సిద్ధాంతంగానీ, ఆ రచనగానీ పరిపూర్ణతను సాధించగలుగుతుంది. జానపద (ఫోక్ లోర్) ప్రబంధ (క్లాసికల్) సాహిత్యాల్లోని ఉత్తమ గుణాల్ని జీర్ణంచేసుకొన్నప్పుడే, క్రొత్తపాతలమేలు కలయికను సాధించగల్గినప్పుడే వివిధ వస్తువుల్లోనూ, వివిధ దృశ్యాల్లోనూ ఉన్న అంతర్బహిర్వైరుధ్యాలను ఆయా విరుద్ధ శక్తుల ఘర్షణ ద్వారా బహిర్గతమొనర్చి వాటిని తొలగించడంద్వారా కలిగే గుణాత్మక (విప్లవకర) మైన మార్పులను వైరుధ్యాలకు సంబంధించిన ఇతర విధానాలద్వారా కలిగే పరిమాణాత్మక (పరిణామాత్మక)మైన మార్పులను చిత్రించడంలోనే సాహిత్యానికి సమగ్రత లభిస్తుంది. ఇదే గతి తార్కిక చారిత్రక భౌతికవాద పద్ధతి. ఇదే మార్క్సిస్టువిధానం. అంతేకాదు. ఏ సమస్యనైనా వివిధ వృత్తి కళాశాస్త్ర సాంకేతిక విద్యాదృక్కోణాలనుంచి చూచి సరిగా అవగాహనచేసుకొని దానికి తగిన పరిష్కార మార్గాన్ని ఇవ్వగలిగినప్పుడే అది సంపూర్ణమైన విధానమూ,

పద్ధతి అవుతుంది. ఇందుకు ఇటీవలి మన రాజధాని సమస్యే ఉదాహరణగా తీసుకోవచ్చు. విజయవాడ ఏ విధంగా ఆలోచించినా, ఏ కోణంలోనుంచి చూచినా ఆంధ్రదేశానికి రాజధానిగా అర్హతగలిగిన నగరం. కర్నూలు వగైరా మిగతావన్నీ అందుకనర్హమయినవే. కమ్యూనిస్టుపార్టీ విజయవాడనుసూచిస్తే, బూర్జువాపార్టీలు తలకొకటి సూచించాయి. కాని చివరకు బూర్జువా పార్టీలన్నీ ఏకమై కుట్రలతో కుహకాలతో వివిధ ప్రజానీకం కమ్యూనిస్టుపార్టీ ఏకగ్రీవంగా నిర్ణయించిన విజయవాడను సంకుచిత స్వార్థాలతో త్రోసిపుచ్చి కర్నూలును రాజధానిగా తీర్మానించాయి. కాని తిరిగి ద్విగుణీకృతమైన ప్రజాందోళనకు లొంగి తమ అభిప్రాయాలు మార్చుకొని విజయవాడ గుంటూరులకు అధిక సంఖ్యాకులు వోటుచేశారు. ఇంకా ఈ బూర్జువా పార్టీలు తమ కుట్రలు కొనసాగిస్తూనే ఉన్నాయి.

ఇదే కమ్యూనిస్టు విధానానికి బూర్జువా విధానానికి ఉన్న ప్రధాన విభేదం. అన్నిరంగాల్లోని అన్ని సమస్యలను అర్థం చేసుకొనే తీరులోనూ, విధానాలను రూపొందించడంలోనూ, పరిష్కార పద్ధతులు సూచించడంలోనూ కమ్యూనిస్టు పద్ధతికీ, బూర్జువా పద్ధతికీ ఇదే విధంగా పూర్తి వ్యత్యాసం ఉంటుంది. అయితే ప్రజాందోళనకు భయపడి ఒత్తిడికి లొంగి ఒకప్పుడు బూర్జువా వర్గం సరియైన విధానాలను ఎంతో ఆలస్యంగానైనా సిద్ధాంత రీత్యా అంగీకరించ వచ్చు. ఆచరణలో మళ్లీ అడుగడుగునా ఆటంకాలు కల్పించవచ్చు. అంచేత అది దాని సహజ నైఖరిని సూచించదు.

# స్వవిషయం

గత ఇరవై సంవత్సరాలుగా మిగతా అన్నిరంగాల్లో మాదిరిగా సాహిత్యరంగంలోనూ కమ్యూనిస్టులం గణనీయమైన కృషిసల్పాం. కొంత పరిపక్వతను సాధించాం. ఇంకా ఎంతో సాధించవలసి ఉంది. ఇందలి మొదటి వ్యాసం 1950 లో జన. వాణిలో ప్రకటితమైన నా సాహిత్య వ్యాసాలకు అనుస్యూతంగా అప్పుడే వ్రాయ బడింది. మొత్తం మీద యీవ్యాసాలు 1930కు పూర్వం నుంచీ అనేకగ్రంథాలు అధ్యయనంచేసి, 1943 నుంచి అప్పటివరకు రెండుమూడుసార్లు తిరుగవ్రాసి విజయవాడ (1944) మొ. చోట్ల జరిగిన అభ్యుదయరచయితల మహాసభలసందర్భం లోనూ, ఇతర విధాలుగానూ ప్రముఖ పత్రికాసంపాదకుల రచయి తల సమిష్టి ఆలోచనకు సమర్పిస్తూ, చేసిన సుదీర్ఘకృషి ఫలితమని చెప్పవచ్చు. 1945 లో రాజమండ్రిలో జరిగిన ఆంధ్ర అభ్యుదయ రచయితల మహాసభలో ఇందలి ముఖ్య భాగాలు కొన్ని చదువ బడ్డాయి. జనవాణిలోని వ్యాసాల్లో, వివిధసాహిత్య సమస్యల పరి ష్కారంతోబాటు వైదికయుగం నుంచి యిప్పటివరకు జరిగిన సాహిత్యపరిణామాలు ముఖ్యంగా గత పదిహేనేళ్ల ఆంధ్ర సాహిత్య చరిత్ర సంక్షిప్తంగా చిత్రించబడింది. ఆయా వ్యాసాల్లో విమర్శకు గురియైనరచయితలు శ్రీ కొడవటిగంటి, ఆరుద్ర,అనిసెట్టి, రమణా రెడ్డి, సోమసుందర్ ప్రభృతులు తమలోపాల్ని దిద్దుకొని తమ రచనా విషయాన్ని దృక్పథాన్ని కవితావిధానాన్ని మారుతోన్న ప్రజల కనుగుణంగా చాలవరకు మార్చుకున్నారనేది వారి ఇటీవలి రచనలో సుస్పష్టమవుతూంది. నిరాశ, నిస్పృహలతోగూడి తమ కే

అర్థంకాని అయోమయత్వం, అడవి కవిత్వం, భాషలో, భావంలో అరాజకత్వం, అతి వాస్తవికతాది విపరీత ధోరణులు చాలవరకు తగ్గాయి. సర్కస్ కవిత్వాలు, సాముగరిడీల కవిత్వాలు ప్రస్తుత మంతగా కన్పించడంలేదు. కలగూరగంప భాష (హైబ్రిడ్ లాంగ్వేజ్) రచనల్లో కొంత తగ్గింది. సాంకేతికవాదం, రూప వాదం (ఫార్మలిజం) స్వభావవాదం కొంత వెనుకాడాయి. ప్రజా జీవితాన్ని నూతన వాస్తవికతతో చిత్రించడం అధికమయింది.

అభివృద్ధినిరోధక భావాలను ఖండించడాన్ని కేవలందాడిగా భావించడం, అందుకు ఎవరూ నోరుమెదపలేదని వాపోవడం, గుణ దోషాలను ఎంచడాన్ని, విమర్శించడాన్ని ఔత్తిగాసహించ లేకపోవ డం (సోమసుందర్, సగారా, ఆగష్టు 1953) కంటే పొరపాటు మరొకటి లేదు. రచనలోని మంచిచెడ్డలను చూడకుండా కాస్త పేరుబడ్డ ప్రతి రచయిత వ్రాసిన ప్రతిరచనా పూర్తిగా బాగానే ఉంది అని కళ్ళుమూసుకొని భావించడం అభివృద్ధి కెన్నటికీమార్గం కాజాలదు. మహాకవి శ్రీ శ్రీ వ్రాసిన కొన్ని రచనల్లోసయితం ఉన్న అతివాస్తవికతాది ధోరణులను ప్రముఖ రచయితలు పార్టీ బాధ్యులుసయితం ముఖ్యమైన పత్రికల్లో విమర్శించారు. అనుద్ర ప్రభృతుల 'త్వమేవాహం' వగైరా రచనల్లోని తప్పుడు ధోర ణులు చాలమంది ముఖ్యుల విమర్శకు గురియైన విషయం అంద రికీ విదితమే. కనుక ఆ వ్యాసాలు మొదటిభాగంగానూ, ఇవి రెండోభాగంగానూ పరిగణించ వచ్చు.

వీనికొక ప్రత్యేక ప్రాముఖ్యత ఉండటంవల్ల, ఇంతవరకూ ప్రచురితం కాకపోవడంవల్ల ఇవి ముందుగా ప్రకటిస్తున్నా. అవి కూడా పుస్తకరూపంలో త్వరలో పాఠకుల కందించగలనని ఆశిస్తా.

తదుపరి వివిధ రచయితల రచనలను గురించిన విపుల విమర్శలను సయితం క్రమంగా ప్రకటించ దలచాను. అందుకు సోదర రచయితల సాదర సహకారం అవసరం.

ఇక రెండోది ముఖ్యంగా సిద్ధాంతవ్యాసం. దీని చిత్తు ప్రతి 1946 లో వ్రాయడం జరిగింది. ఇవి వ్రాసిన తరువాత నుంచి ఇప్పటివరకు జరిగిన వివిధసంఘటనలు వీటిలోని వస్తువును సిద్ధాంతాల్ని బలపరుస్తున్నాయి. అలాంటి ఘటనలు కొన్నిటిని ఉదాహరణలుగా చేర్చడమయినది. కారణాంతరాల వల్ల వీటెని అప్పటినుంచి ప్రకటించడం తటస్థపడకపోయినా ఈ రచనల్ని చూడటం తటస్థించిన రచయితలు ఇందలి ప్రధాన సూత్రాలను, విషయాలను ఆమోదించారనేది వారిఇటీవలి రచనలవల్ల స్పష్టపడుతోంది. కనుక, రచయితలు, పాఠకులు మా లోగడ ప్రచురణలు 'మార్గదర్శి' 'బతుకు బాటలు'వలె ఈ వ్యాస సంపుటినిగూడ సహృదయతతో స్వీకరిస్తారని విశ్వసిస్తా.

ఇట్లు
భవదీయుడు
కొత్తపల్లి రంగారావు

10–8–1953
అమృతలూరు

# కమ్యూనిస్టులూ - సాహిత్యం

## ప్రథమ ప్రపంచ యుద్ధానంతర దశ - ప్రారంభ దశ

బూర్జువా జాతీయోద్యమంతో బూర్జువా జాతీయతను, దేశభక్తినీ వ్యక్తీకరించే రచనలు వచ్చాయి. కాని, రెండు, మూడు జాతీయోద్యమాలు విఫలం గావటంతో ఒకవైపున కొంతమంది పెట్టీబూర్జువా, మధ్యతరగతి రచయితల్లో నిరాశా నిస్పృహాలు జనించాయి. అవి ఒకరకమైన కరుణ శృంగార భావ కవిత్వాలకు, వివిధ క్షీణసారస్వత సృష్టికి దోహదమయ్యాయి. ఇక రెండోవైపున ఆ ఉద్యమాల్లో చురుకుగా పాల్గొని, పట్టణాలు, పల్లెల్లోని వివిధప్రజల్లోనూ ఆ ఉద్యమనిర్మాణానికి, విస్తరణకు విశేషకృషి సల్పి, వాడవాడలకూ, పల్లెపల్లెలకూ జాతీయోద్యమ సందేశాన్ని గొనిపోయిన మరికొంతమంది యువకుల్లో రాజకీయంగా మితవాద, మతవాద, భావవాద బూర్జువా నాయకత్వం యెడల తీవ్రమయిన అసంతృప్తి జ్వాలలు రేగాయి. అందుకు తోడు 1917 రష్యన్ సోషలిస్టు మహావిప్లవం మిగతా ప్రపంచమంతటిలోనూ తన అపూర్వ విప్లవ భావతరంగాల్ని ప్రసరింపజేసింది. అంతేగాక, యీ విప్లవప్రభావం యుద్ధానంతర ఆర్థిక దుస్థితి ఫలితంగా నిరుద్యోగులై, బూర్జువా నాయకత్వం

యెడ అసంతృప్తులైన యువకుల, కార్మికుల తదితర శ్రమజీవుల మేధావుల రాజకీయ సమాలోచనా శక్తికి ప్రోత్సాహ మొసగి వారి భావవిప్లవానికి దోహదమయింది. పాశ్చాత్య దేశాలకు విద్యాభ్యాసం నిమిత్తం వెళ్లిన విద్యార్థులు సంపాదించిన మార్క్సిస్టు విజ్ఞానం, వాఙ్మయం, రష్యా వెళ్లివచ్చిన మరి కొంతమంది ప్రత్యక్షానుభవం యిందుకు తోడ్పడ్డాయి. అటు పిమ్మట బూర్జువా దేశాలన్నీ ఆర్థిక దుస్థితిలో మునిగియున్న సమయంలో, విజయవంతంగాసాగిన బ్రహ్మాండమైన సోవియటు పంచవర్ష ప్రణాళికలు బూర్జువా ప్రజాస్వామ్యంనుంచీ సోషలిజం వైపుకు అనేకమంది దృష్టిని ఆకర్షించాయి. అయితే వీరిలో కొంతమంది ప్రజాపునాది లేని వ్యక్తిహింసా (టెర్రరిస్టు) ఉద్య మాలవైపుకు మొగ్గారు. మిగిలినవారు కార్మిక, కర్షక ప్రజోద్యమ నిర్మాణానికి పూనుకొన్నారు. కాని సామ్రాజ్యవాద ప్రభుత్వం యీ యువకులపై కాన్పూరు, మీరట్ కుట్రకేసులు, లాహోర్ కుట్రకేసు వగైరా అక్రమకేసులుపెట్టి, కఠినశిక్షలు విధించి అంకురావస్థలోనే యీ ఉద్యమాల్ని అణచివేయ జూచింది. అయినప్పటికీ కమ్యూనిస్టుపార్టీ, కార్మికోద్యమాలు, వివిధ ప్రజా సంఘాలు పుట్టి వర్ధిల్ల సాగాయి. కమ్యూనిస్టుపార్టీ నిషేధించ బడింది. ఈ ఆర్థిక రాజకీయ, జాతీయాంతర్జాతీయ బాహ్యపరి స్థితులు భారత రాజకీయ రంగంతో బాటు సాహిత్యరంగంలో గూడా విప్లవ పరిణామాలకు కారణమయ్యాయి.

క్రమంగా కార్మికోద్యమాన్ని, కష్టజీవుల జీవితాన్ని వర్ణిస్తూ, కూలిరైతులను ప్రబోధిస్తూ- "ఎగరాలి ఎగరాలి మన ఎఱ్ఱజెండా" లాంటి గేయాలూ, కొన్ని చిన్నకథలూ బయలు

దేరాయి. ఈ సమయంలోనే యీ విప్లవ వాతావరణాన్ని ముందు చక్కగా అవగాహన జేసుకొని నవ్యసాహిత్య పరిషత్తుకు సంబంధించిన ప్రతిభావంతుడైన యువ కవి శ్రీశ్రీ

"మరో ప్రపంచం! మహా ప్రపంచం పిలిచింది!
పదండి ముందుకు, పదండి త్రోసుక, పోదాం పోదాం పైపైకి!"

అని విప్లవాశయ స్పష్టతతో గొంతెత్తి పాడాడు. అటుతరువాత 'ఏ దేశపు చరిత్ర చూచినా' అనే చరిత్రగేయం వగైరా మరికొన్ని అభ్యుదయ గేయాలు వ్రాశాడు. ఈ దశలో వెలువడిన గేయాలు వగైరా లెక్కకు తక్కువే అయినా, అవి మన ఉద్యమాన్ని నిర్మించి బలపరచాయి. వాటికి ఊతం ఇచ్చి ముందుకు తీసుకు పోయాయి.

వీటితోబాటు ప్రపంచ శ్రామిక వాఙ్మయం (వరల్డ్ ప్రాలిటేరియన్ లిటరేచర్) అనువదింపబడి విప్లవభావాలను వెదజల్లింది. విశ్వవిఖ్యాత శ్రామిక రచయిత 'మాగ్జిం గోర్కీ' వ్రాసిన 'అమ్మ' అనే నవల ఉద్యమ నిర్మాణానికి విశేషంగా తోడ్పడింది. అటుపిమ్మట సోవియట్ రచయితలు 'షోలకోవ్' ప్రభృతులు వ్రాసిన 'బీళ్లు దున్నేరు', 'నాడు-నేడు' అనే నవలలు, జర్మన్ కార్మికోద్యమాన్ని ప్రతిబింబించే 'అన్నా' అనే నవల, ఇటలీ కార్మికోద్యమాన్ని చిత్రించిన- 'ఫాంటా మారా' అనే నవల వగైరా అనువదింపబడి కార్మిక కర్షకోద్యమ వ్యాప్తికి తోడ్పడ్డాయి. రష్యా విప్లవ కథలు, చీనా విప్లవ కథలు ప్రచారంలోకి వచ్చాయి. ఆంధ్ర ప్రజానీకంలో ఎనలేని ప్రబోధాన్ని కలిగించాయి.

# ద్వితీయ ప్రపంచ యుద్ధ దశ - సాహిత్యంలో తీవ్ర పరిణామాలు

ఫాసిస్టు వ్యతిరేక ప్రపంచ యుద్ధంలో ప్రపంచ సాహిత్య రంగంలో అనేక నూతన ఫలితాలు గలిగాయి. విశేషించి అనన్యసామాన్య దేశభక్తియుతమై ప్రపంచ విముక్తికోసం, సుస్థిర విశ్వశాంతికోసం సలిపిన రష్యా మహాయుద్ధం ప్రపంచప్రజా సాహిత్యంలో అపూర్వ అత్యద్భుత పరిణామాలు గలిగించింది. ప్రకృతిని, జీవితాన్ని గురించి మార్క్సిజం-లెనినిజం చేసిన వ్యాఖ్యానాలు, సిద్ధాంతాలు ఖచ్చితమైనవనీ, శాస్త్రీయమైనవనీ ఋజువుచేసింది. అది సమాజ జీవితంలో తీసుకువచ్చిన మార్పులు సుస్థిరమైనవని చాటింది. అందుకు పునాది అయిన కుటుంబ జీవితానికి, జాతీయ జీవితానికి 'త్యాగం' వగైరా ఉత్తమ సాంఘిక అంతర్జాతీయ గుణాలను పెంపొందించి క్రొంగ్రొత్త మెఱుగులు కూర్చింది. వ్యక్తికీ - సంఘానికీ, జాతీయతకు - అంతర్జాతీయతకు చక్కని సమన్వయం కుదిర్చింది. వాఙ్మయాన్ని అమోఘాయుధంగా జేసి ఉత్తేజాన్నీయడమేగాక, అమృతమయంగా జేసి ఆహ్లాదాన్ని కలిగించింది. ప్రపంచ ప్రజలందరికీ పరమశత్రువయిన ఫాసిజంపై వీరోచిత పోరాటం గావించి దిగ్విజయం పొందిన నూత్న మానవుల హృదయాల్లోని ఔన్నత్యాన్ని, గాంభీర్యాన్ని, భావోద్రేకాల్ని రసరాహస్యాలను వెలువరించింది. వారి అద్భుత మేధస్సులు బాహ్యావాస్తవికతను తఱచి తఱచి నిగ్గు తేల్చిన పరమ సత్యాలను చాటింది. అత్యద్భుతోదాత్తశక్తిని

ప్రదర్శించి, మహోజ్జ్వల సందేశాన్ని విశ్వమున కందించి విశ్వ వాఙ్మయ ప్రాంగణంలో యీ యుద్ధసమయ రష్యా వాఙ్మయాని కగ్రతాంబూలం సమర్పింపజేసింది. దేశభక్తికీ ప్రపంచ ప్రజా విముక్తికీ సుస్థిరశాంతికి ఫాసిస్టు వ్యతిరేక సమరాన్ని తీవ్రతరం గావించడమే ఏకైక మార్గమని చాటి ప్రపంచ ప్రజానీకంలో అంతర్జాతీయత నెనర్లు అభివృద్ధిజేసింది. సోషలిస్టు వీరత్వాన్ని, సోషలిస్టు మానవత్వాన్ని, సోషలిస్టు వాస్తవికతను యీ సాహిత్యం ఎంతోగొప్పగా ప్రతిబింబించింది. కురుక్షేత్రసంగ్రామంనాటి నుంచి ఈ నాటివరకు సాగిన భయంకర యుద్ధాలన్నిటికంటె అతి భయంకరమైన యీ మహాయుద్ధాన్నిగురించి శ్రీ శ్రీ "గర్జించు రష్యా, గాండ్రించు రష్యా, పర్జన్య శంఖమ్ము పూరించు రష్యా..." అని వర్ణించాడు.

ఈ దశలోనే పార్టీపై నిషేధం తొలిగి, బహిరంగ రాజకీయ ప్రచారాందోళనావకాశాలు లభించాయి. పార్టీ ప్రజా పార్టీగా అభివృద్ధిచెంద జొచ్చింది. సాహిత్యరంగంలో పార్టీ గావించిన కృషిఫలితంగానూ, పార్టీ చొరవతోటీ, నాయకత్వం తోటీ సజ్జాద్ జహీర్ మొదలగు పార్టీనాయకులు, ప్రేమ్‌చంద్, ఆనంద్ మొదలగువారు స్థాపించిన అఖిలభారత అభ్యుదయ రచయితల సంఘానికి శాఖగా ఆంధ్రలోగూడా "ఆంధ్రాభ్యుదయ రచయితల సంఘం" ఏర్పడింది. పార్టీ రాజకీయరంగంలో గావించిన 'మితవాద సంస్కరణవాద తత్వం' మొదలైన పొరపాట్లే సాహిత్యరంగంలోనూ గావించినందువల్ల పెల్లుబికిన ప్రజా ఉద్యమ నెల్లువ నిది పూర్తిగా ప్రతిబింబించలేకపోయింది. అయినప్పటికీ, అనేకమంది నూతన రచయితలు, వివిధ ప్రజాఉద్య

మాల్లో పనిచేస్తున్న రచయితలు యీ ఉద్యమంద్వారా సంఘటితపడి కొంత అభివృద్ధి పొందారు.

అంతేగాక, నవ్యసాహిత్యపరిషత్తుకు సంబంధించిన యువ రచయితలు, భావకవులు శ్రీ శ్రీ, కొడవటిగంటి, అనిసెట్టి ప్రభృతు లనేకమంది యీ ఉద్యమంలో చేతులు కలిపారు. జాతీయోద్యమాల్లో పాల్గొన్నవారు గూడా కొంతమంది యిటు ఆకర్షింపబడ్డారు. ఆంధ్రసాహిత్యపరిషత్తుకాలం నుంచీ వాస్తవిక దృష్టిగల్గి ప్రముఖులుగా ఉన్న వృద్ధరచయితలుకూడా కొంతమంది మన ఉద్యమంపట్ల తమ సానుభూతి చూపెట్టారు.

యుద్ధకాలంలో మనదేశంలో బెంగాలు వగైరా అనేక ప్రాంతాల్లో సామ్రాజ్యవాదుల దోపిడిఫలితంగానూ, వాళ్లూ, కాంగ్రెసు లీగు బూర్జువా నాయకులూ అనుసరించిన చెడు విధానాల ఫలితంగానూ దేశమంతటా - విశేషించి బెంగాలులోనూ చెలరేగిన అమిత పరాశాపరులైన తిండిదొంగలు తెచ్చిపెట్టిన కరువు కాటకాల ఫలితంగా దాదాపు 35 లక్షలమంది ప్రజలు దిక్కులేనిచావు చచ్చారు. కోట్లకొలది ప్రజలు అంటురోగాల పాలయి జీవచ్ఛవాలయ్యారు. ఫాసిస్టు వ్యతిరేక యుద్ధఫలితంగా రష్యా పొందిన తీరని నష్టాలతరువాత మనం పొందిన యీ మహానష్టాలనే పేర్కొనవచ్చు.

## ద్వితీయ ప్రపంచ యుద్ధానంతర దశ

వీర సెడార్మీ చేసిన అంతులేని త్యాగాలఫలితంగానూ ప్రత్యక్షంగా, పరోక్షంగా గావించిన విముక్తి ఫలితంగానూ యుద్ధానంతరం ప్రపంచంలోని వివిధ దేశాల బానిస బంధాలు

ఒకటివెంట ఒకటి సడలిపోసాగాయి. స్వతంత్ర విప్లవ శంఖారా వాలు నలుమూలలనుంచీ వినబడుతున్నాయి. పీడిత ప్రజా హృదయాల్లో తిరిగి ఆశాజ్యోతులు వెలుగొందుతున్నాయి. మన స్థానమెక్కడ? మన స్థితి ఏమిటి? అని యెంతో ఆతురతతో ప్రతిజాతి సింహావలోకనం జేసుకొంటుంది. ఈ తీవ్ర ఫాసిస్టు వ్యతిరేక యుద్ధాగ్నులలోనుంచీ తూర్పు యూరపుదేశాలు, తూర్పు జర్మనీ, ఉత్తర కొరియా దేశాలూ, దీర్ఘకాలాంతర్యుద్ధం నుంచీ ప్రపంచంలో ధాదాపు ఐదోవంతు జనాభా గలిగిన చైనా దేశమూ నూతన ప్రజాతంత్రరాజ్యాలుగా క్రొత్తగా అవతరించాయి. అస్వతంత్ర వలసదేశాలన్నిటా కార్మిక కర్షకోద్యమాలు సాయుధ స్వాతంత్ర్య పోరాటాలుగా పరిణమించి విజృంభించాయి. అలాగే మనదేశంలోగూడా వివిధ పరిశ్రమల లోని కార్మికులు, సైనికులు, నావికులు, పోలీసులు, విద్యార్థులు, వ్యవసాయ కూలీలు, పేద, మధ్యతరగతి రైతులు, చిన్న ఉద్యోగస్థులు, ఉపాధ్యాయులు సాయుధ పోరాటాలతోబాటు సమ్మె పోరాటాలు జరిపారు. పెల్లుబికివచ్చే యీ ప్రజా ఉద్యమ వెల్లువకు బెదరి, సామ్రాజ్యవాదులు కాంగ్రెసు లీగు బూర్జువానాయకులు రాజీపడి, కృత్రిమమైన మతసూత్రంమీద జరిపిన దేశ విభజన ఫలితంగా చెలరేగిన మతకలహాగ్ని జ్వాలల్లో మళ్లీ అనేక లక్షలమంది భస్మీపటలమైపోయారు. లక్షలకొలది మైనారిటీ ప్రజలు ఆస్తిపాస్తులను గోల్పోయి నిరాశ్రయులై కాందిశీకు లయ్యారు. ఈ ద్రోహం చాలక ప్రజాఉద్యమాలమీద అంతులేని క్రూర నిర్బంధవిధానం దేశమంతటా అమలుజరిపారు. జరుపుతున్నారు. వాక్సభా పత్రికా స్వాతంత్ర్యాది పౌరస్వాత

హక్కులను వమ్ముగావించారు. ఇదంతా అహింస అనేగాబోలు బూర్జువా జాతీయనాయకులు ఒక్క నెత్తురుబొట్టు చిందకుండా సత్యాహింసలద్వారా మేము స్వరాజ్యం తెచ్చామనీ, కేవలం రామరాజ్యం స్థాపించామనీ డంబాలు పలుకుతున్నారు. రష్యా విప్లవంలో జరిగినదని వీళ్ళు బాకాలూదుతోన్న రక్తపాతం పై వాట్లో ఎన్నోవంతో! (నవంబరు విప్లవంలో అసలు రక్తపాతమే జరగలేదని చరిత్ర చెబుతోంది.) పక్షపాతంలేని సత్యప్రియుడైన భావి చరిత్రకారుడు యీ నగ్నసత్యాన్ని తన సునిశిత లేఖినితో భారత చరిత్రలోని ద్రోహపూరితమైన విషాద గర్భితమైన యీ అధ్యాయంలో లిఖించకపోడు. బూర్జువా నాయకుల అసలు బండారం, సామ్రాజ్యవాదులతో వాళ్లు గావించుకొన్న కుటిల స్వార్థపూరిత రహస్య ఒడంబడికలు ప్రపంచ ప్రజలయెదుట బయటపెట్టకపోడు.

## వివిధ దశల్లో వివిధ రూపాల్లో ప్రజాసాహిత్యం

ఈవిధంగా దినదినమూ వృద్ధిపొందుతోన్న మన కార్మిక కర్షక ప్రజా ఉద్యమాలతోబాటు మన ప్రజా వాఙ్మయం గూడా అభివృద్ధి జెందుతోంది. ఆయాదశల్లోని పార్టీ రాజకీయ కర్తవ్యాలకూ, పాలసీలకు అనుగుణంగా కార్మికవర్గ నాయకత్వంతో గూడిన ప్రజల సాహిత్యం గూడా ననలు వేయ సాగింది. ఇంతేగాక, రష్యన్ యుద్ధకథలు, వివిధ దేశాల ఫాసిస్టు వ్యతిరేక ప్రతిఘటనోద్యమాల గాథలూ వగైరా యీ దశలో జనించిన విశ్వ సాహిత్యం కొంత అనువదించబడి విరివిగా ప్రచారంలోకి వచ్చింది. 'ప్రజాశక్తి ప్రచురణలు' 'మొదలైనవాటిద్వారా

ఆంధ్ర సాహిత్యోద్యమంలో ఒక నూతనశకం నెలకొల్పబడింది. ప్రజానీకంలో 60 ఏళ్ల జాతీయోద్యమ చరిత్రలో యిదివర కెన్నడూ కనివిని యెరుగనంతగా సారస్వత పిపాస పెంపొందింది. వందలకొలది పుస్తకాలు, కరపత్రాలు, వేలకొలది ప్రతులు మొత్తం లక్షల కొలదిగా ప్రజా సామాన్యంలో ఖర్చయ్యాయి.

ఇంతవరకు వచ్చిన యీ ప్రజా సాహిత్యాన్ని యీ క్రింది విధంగా ముఖ్యంగా ఐదు దశలుగా విభజించవచ్చు.

1. కార్మిక కర్షకోద్యమాలకుసంబంధించిన ప్రారంభరచనలు:
నవశక్తి ప్రచురణలు, ఆదర్శగ్రంథమండలి, విశ్వసాహిత్యమాల, నవ్య సాహిత్యమాల మొ. వాటి ద్వారానూ, నవశక్తి, కాగడా మొ. పత్రికల ద్వారానూ కొన్ని గేయాలూ, కథలూ, నవలలూ, సిద్ధాంత గ్రంథాలు వగైరా ప్రచురించబడ్డాయి. ఇవి ఉద్యమాన్ని నిర్మించాయి.

2. ఫాసిస్టు ప్రతికూల రచనలు:
'ప్రజాశక్తి ప్రచురణల' ద్వారా యీ దశలో కొన్ని గేయాలు, కథలు రాజకీయ గ్రంథాలతోపాటు కొన్ని మార్క్సిస్టు సిద్ధాంతగ్రంథాలు ప్రచురించ బడ్డాయి. ఇవి ఉద్యమాన్ని బలపరచి వ్యాపింప జేశాయి.

3. జాతీ యైక్యతాది ప్రబోధక రచనలు:—
రైతుకూలీ పాటలు, కరువుగేయాలు, జాతీయగేయాలు, విప్లవగేయాలు, మహిళాగేయాలు, బాలసంఘంపాటలూ,

కొన్ని బుర్ర కథలు, నాటికలూ, రాజకీయ గ్రంథాలూ వగైరా ప్రచురించ బడ్డాయి. ప్రజా నాట్యమండలి స్థాపించబడింది. ఇవి ఉద్యమాన్ని విస్తరింప జేశాయి.

4. తెలంగాణా ప్రజా పోరాటాన్ని, వ్యవసాయ విప్లవాన్ని, వివిధకార్మిక కర్షక ప్రజాపోరాటాల్ని చిత్రిస్తూన్న రచనలు: వివిధ ప్రజా పోరాటాలు విజృంభించాయి. 'అభ్యుదయ' 'తెలంగాణా ప్రత్యేకసంచిక' ఒకటి ప్రచురించింది. కొన్ని కరపత్రాలు వీర తెలంగాణా ప్రజా పోరాటాన్ని చిత్రించే 'మృత్యుంజయులు'అనే నవల ప్రజాశక్తి ప్రచురణల ద్వారా ప్రచురించబడ్డాయి. ఇవి ఉద్యమాల్లో ఉత్తేజాన్ని వెల్లువను గొని వచ్చాయి.

5. స్వాతంత్ర్యం, శాంతి, నూతనప్రజాతంత్రంకోసం పోరాడే సాహిత్యం: మితవాద సంస్కరణ వాద తత్వంనుంచి బయటబడి తీవ్ర ఆంతరంగిక సంఘర్షణతో రెండుమూడు సార్లు పాలసీలు, నాయకత్వం మారిన పిమ్మట పార్టీ తన నూతనపాలసీని నూతన నాయకత్వాన్ని నిర్ణయించు కొంది. ఇది ఉద్యమాన్ని కొత్తపుంతల్ని బట్టించింది.

ఇలా ముఖ్యంగా ఐదు దశలుగా పార్టీ సాహిత్యం యిప్ప టికి అభివృద్ధి చెందింది. పై అయిదు దశల్లోనూగలసి సుమారు నూరు గేయాలకు పైగా వివిధ సభలు, సమావేశాలు, ఉత్స వాలు, ఊరేగింపులు, ప్రదర్శనలు, మహా సభలు వైజ్ఞానిక దశాల ప్రచారాల్లో ప్రసిద్ధమై ప్రబోధాన్ని గావించాయి. ఇంకా మరికొన్ని వందల గేయాలుత్పత్తి యయ్యాయి.

అవి ముఖ్యంగా- "ఎగరాలి, ఎగురవెయ్ మొ. జెండా పాటలు, 'పదండి ముందుకు' 'గర్జించురష్యా' 'ఓ హిట్లర్' గెరిల్లా పిలుపు, మాస్కో- పొలిమేరలోన, స్టాలిన్, ఎర్రసైనికుడా మొ. ఫాసిస్టు వ్యతిరేక రెడార్మీ గేయాలు; ముందునడూ, 'కదనభూమి కేగుదాం' మొ. మార్చింగ్ సాంగ్స్, కయ్యూరుకామ్రేడ్స్ స్మారక గేయాలు, పడవ పాటలు, చెంచు, లంబాడి, బైరాగి పాటలు, కూచిపూడిభాగోతాలు, పంటసిరినృత్యం, భారతవీరులు, చేయెత్తి జైకొట్టు, ఆంధ్రజాతీయగేయాలు,'వెలలేనిమాగాణిరా పలనాడు' మొ. చారిత్రకగేయాలు, 'పచ్చపచ్చగ పెరిగి' బెంగాలు వగైరా కరువు గేయాలు, 'ఖబడ్దార్' మొ. నైజాం రజాకార్ వ్యతిరేక గేయాలు, మత కలహాల పై గేయాలు, వ్యవసాయ విప్లవ గీతాలు, తెలంగాణా విప్లవ గేయాలు, చీనా విప్లవ గీతాలు, 'రక్తపతాకం ఎగరేశారా' మొ. స్వాతంత్ర్యం నూతన ప్రజాతంత్రం ఆశయంగా గల గేయాలు మొదలైనవి.

ఇలా ఈ గేయాలు అనేకరూపాలతో వివిధ విషయాలతో వచ్చాయి. అవి లోగడ మాదిరిగా ఊరికే పుస్తకాల్లోనే ఉండిపోలేదు. అవి ప్రజల వివిధ ఉత్పత్తికార్యక్రమాలకు అత్యంత సన్నిహితమైన జాతీయ జానపద నృత్యరూపాల్లో ఉండడంవల్ల వెంటనే ప్రజల్లోకిపోయి ప్రజానీకాన్ని ప్రబోధించి తగిన ఫలితాల నిచ్చాయి. ప్రజలచేతుల్లో ఆయుధాలుగా ఉద్యమ విస్తృతికి తోడ్పడ్డాయి. ఆబాల గోపాలం ప్రజల నోళ్లలో మారు మ్రోగాయి. ఇవేగాక- 'దేశమును ప్రేమించుమన్నా' అనే గురుజాడ గేయానికి చక్కని రాగమమర్చి దేశమంతటా ప్రతిధ్వనింపజేయబడింది. అంతేగాక చైనా గెరిల్లాయోధులు

టాన్యా, కష్టజీవి, కన్యక, బెంగాలుకరువు, పల్నాటివీరులు, వీరేశలింగం, అల్లూరి సీతారామరాజు వగైరా బుర్రకథలు, విరివిగా లక్షలకొలది ప్రజల్లో ప్రచారంగావించబడ్డాయి. ఈ దశలో అనేక వైజ్ఞానిక దళాలు నిర్మించబడి ప్రచారంజేశాయి.

ఇంతేగాక ప్రజానీకంలోనుంచి అనేకమంది గేయకారులు పుట్టుకొచ్చారు. ప్రారంభావస్థలోని రచయితలుగూడా తమలో జాజ్వల్యమాన మవుతోన్న పోరాటతత్వం, రాజకీయ చైతన్యాల కారణంగా చక్కని రచనలు చేశారు. విద్యార్థులుగూడా కొంతమంది కొన్ని సమయాల్లో నీళ్ళుగారే రచనలు చేశారు. వివిధ జానపద రూపాలు హిందూసానీ బాణీలు, ఇంకా అనేక నూత్న రూపాలు స్వీకరించబడ్డాయి. మొత్తంమీద గేయకవిత్వం యీ దశలో పరిణతదశకు వచ్చింది. విషయానుగుణమైన రూపాలు, భాష అవి ప్రజలకు సన్నిహితంగా ఉండడంతో గేయకవిత్వాని కెంతో ప్రాముఖ్యత వచ్చింది. ఉద్యమాలు ప్రచారావస్థలోనూ, రచయితలు యువక దశలోనూ, ప్రజలు హెచ్చుగా నిరక్షరాస్యులుగానూ ఉండడంవల్ల మిగతా రూపాలకంటె గేయాలే హెచ్చుగా ఉత్పత్తిగావడం ప్రచారంలోకి రావడం జరిగింది.

తుమ్మల, శ్రీశ్రీ, సుంకర, కొత్తపల్లి, శ్రీకృష్ణ, కోగంటి, ముక్కామల, లక్ష్మీకాంతమోహన్, ప్రయాగ, అనిసెట్టి, ఆరుద్ర, ఈరా, చిరంజీవి, ఆచార్య, అయ్యప్ప, గోపాలం, పల్చూరి, పోలూరి, కుందుర్తి, రామదాసు, వాసిరెడ్డి, కొండేపూడి, శివయ్య, నాజర్, సోమసుందర్, కొనకళ్ళ, విశ్వం, నారపరెడ్డి, రమణారెడ్డి, టి.వి.కృష్ణ, గంగినేని, దాశరథి, భాగి, సి.నారాయణరెడ్డి, రెంటాల,

శార్వరి,అవసరాల, టి.సీతారామాంజనేయులు, పూలకుంట సంజీవులు, మొదలయినవారీ యుగంలోని గేయకారుల్లో ముఖ్యులు.

చిన్నకథలు: ఆయా ప్రజాఉద్యమాల్ని చిత్రించే చిన్నకథలు కొన్ని యీ శకంలోవచ్చాయి. కొసరాజు, చంద్రం, ఈరా, కొడవటిగంటి, లక్ష్మీకాంతమోహన్, శివరాం, ప్రయాగ, వరుచూరి, పొట్లపల్లి, మాన్స్, మాచినేని, సోమసుందర్, రాంషా, శారద, కొరటాల, శార్వరి, విపంచి, ధర్మకుమార్, ప్రా, దరిశి, గంగినేని, మొదలైనవారీ కథకుల్లో ముఖ్యులు.

రష్యన్ యుద్ధకథలూ, ఇటీవల గోర్కీ, చెకోవ్ ప్రభృతులకథలూ, చీనాకథలూ, అనువదించబడ్డాయి. 'జ్యూలియస్ ఫ్యూజిక్' వ్రాసిన 'నోట్స్ ఫ్రమ్ ది గాలస్' 'రక్తాక్షరాలు' పేరుతో అనిసెట్టి అనువదించాడు.

నాటికలు—ఏకాంకికలు: రామమోహన్, రాజారావు, సుంకర—వాసిరెడ్డి, వినాయకరావు, ప్రయాగ, ఆత్రేయ, గోరాశర్మ, తెన్నేటి సూరి, పొట్లపల్లి మొదలైనవారిందు ముఖ్యులు. ఇందులో సుంకర-వాసిరెడ్డి, వ్రాసిన 'ముందడుగు' 'మాభూమి' నాటికలు లక్షలకొలది ప్రజల్లో ప్రచారమయ్యాయి. ఆత్రేయ, గోరాశర్మ వ్రాసిన నాటికలుగూడా బాగానే ప్రదర్శింపబడ్డాయి. 'ప్రజానాట్యమండలి' శాఖలు అనేక గ్రామాల్లో నెలకొల్పబడి పై నాటికలు ప్రదర్శింపబడ్డాయి. తెన్నేటి సూరి వ్రాసిన 'గొడ్డకాడ' అనేదీ, కోటీశ్వరరావు వ్రాసిన 'అల్లరి సూర్యం' అనేదీ బాలసంఘాలచే పలుచోట్ల ప్రదర్శించబడ్డాయి. పై నాటికల్లో ముఖ్యంగా పోరాటతత్వం కొంతవరకు ప్రస్ఫుటమవుతుందేగాని,

చిరకాలం ప్రజల హృదయాల్లో హత్తుకుపోయేలాగు పాత్ర చిత్రణ, జీవితపు లోతులు నగ్గిరా తెరుగనే చెప్పాలి.

ఇటీవల 'విశ్వం' ఇబ్సెన్ వ్రాసిన ఒకనాటకాన్ని 'మహా శిల్పి' అనే పేరుతోనూ, చెకోవ్ నాటకం ఒకదాన్ని 'సత్యం మామ' అనేపేరుతోనూ భారతీయంచేసి అనువాదం చేశాడు. శ్రీనివాస చక్రవర్తి 'సీటికాకి' అనే చెకోవ్ నాటకాన్ని సహజంగానే అనువదించాడు. ఆత్రేయ 'విశ్వశాంతి' గోపాలరావు 'శాంతిసందేశం' మొదలగునవి బాగా ప్రదర్శించబడుతున్నాయి.

<u>నవలలు</u> : గోర్కీ, షోలకోవ్, ముల్కరాజ్ ఆనంద్, వాండా వాసిలేవిస్కా ప్రభృతుల నవలలు తెలుగులోనికి తేబడ్డాయి. తెలంగాణా ప్రజాపోరాటాన్ని చిత్రిస్తూ 'మృత్యుంజయులు' అనే నవల వెలువడింది. 'అతడు-ఆమె' అనే అభ్యుదయనవల వచ్చింది. రోమారోలా వ్రాసిన 'జాన్ క్రిస్టాఫర్' ను 'మానవుడు' అనే పేరుతో విశ్వం అనువదించాడు. పడాల రామారావు 'ఖైదీ' అనే నవల వ్రాశాడు. మొన్ననే లక్ష్మీకాంతమోహన్ 'సింహగర్జన' వెలువడింది. 'అన్నా కారినీనా' 'నేరము-శిక్ష' వేగుచుక్క మొదలగునవి అనేకనవలలు అనువదించబడ్డాయి.

స్వతంత్రనవలలు చాలా పరిమితంగానే వచ్చాయి. కారణం మొన్నమొన్నటివరకు ఉద్యమాలు ప్రచారావస్థలోనే ఉండడం తీవ్ర ప్రజాపోరాటాలు తక్కువ కావటం అయి ఉండవచ్చు. రచయితలు లోతైన జీవితానుభవం లేనివాళ్లు గావడం కూడా యిందుకు ముఖ్యకారణమేమొ !

<u>వ్యాసాలు-విమర్శలు</u> : తుమ్మల, చంద్రం, ఈరా, శివయ్య, కొడవటిగంటి, శ్రీశ్రీ, కొత్తపల్లి, ప్రయాగ, విశ్వం

మొదలైనవారు ముఖ్యులు. మొత్తంమీద సాహిత్య విమర్శ చక్కగా అభివృద్ధిపొందలేదనే చెప్పవచ్చు.

ఇటీవలజరిగిన సాహిత్య విమర్శల్లో, వాదాలు-చర్చల్లో కొత్తగా కొంతమంది పాల్గొన్నారు. వారు రాం, వాసిరెడ్డి' కె. వెంకటేశ్వరరావు, ఎ. పి. ఆర్. ఆరుద్ర-రాంషా, మృత్యుం జయశాస్త్రి మున్నగువారు.

వైజ్ఞానిక గ్రంథాలు: నీవూ-నీ పుట్టుక, నీవూ-నీ పరిణామం, ప్రసూతీ-శిశుపోషణ,మానుషశాస్త్రం-ఆదిమనివాసులు, మానవ విజయం, కారుచీకటికి కాంతిరేఖ, యక్షప్రశ్నలు, మానవులు-మహీధరములు మొదలయినవి వెలువడ్డాయి.

అనువాదకులు: తుమ్మల, కంభంపాటి, చంద్రం, మహీధర సోదరులు, విశ్వం, మానేపల్లి, వాసిరెడ్డి, అనిశెట్టి, కోటీశ్వరరావు, శివయ్య, నిడుమర్తి, మహేశ్, కొత్తపల్లి, విజయకుమార్, కాట్రగడ్డ, ఏరుమూరి మొదలైనవారు.

పత్రికలు: నవశక్తి, కాగడా, ప్రజాశక్తి, తెలుగుతల్లి, అభ్యుదయ, వర్కర్, నవయుగ, జనత, జనవాణి, విశాలాంధ్ర (పక్ష) అరుణరేఖ, నగారా, సందేశం, రజకప్రభ, ప్రజాయుగం, జ్వాల, ఉదయిని, విశాలాంధ్ర (దినపత్రిక) మొ.

ఇలాగా క్రమంగా ఉరకలతో, దాట్లతో గత రెండు మూడు దశాబ్దాలలోను ఎంతో కళా కాంతులతో సర్వతోముఖంగా అభివృద్ధి బొందిన వివిధ ప్రజా ఉద్యమాలూ యీ మధ్య (1946-1951) కాంగ్రెసు ప్రభుత్వాల ఫాసిస్టు నిర్బంధవిధానంతో

విచక్షణా రహితంగా అణగద్రొక్క బడ్డాయి. వివిధ ప్రజా ఉద్యమాలను ప్రతిబింబించే ఆంధ్రప్రజల ఏకైక దినపత్రిక 'ప్రజాశక్తి' కాంగ్రెసు మిలిటరీచే సర్వవిధ్వంసం గావించ బడ్డది. ప్రజా ఉద్యమాల మీద 'ముందడుగు' 'మా భూమి' మొ. ప్రజా సాహిత్యం మీద నిషేధాలు విధించబడ్డాయి. వాక్సభా పత్రికా స్వాతంత్ర్యాది సర్వ పౌరస్వత్వ హక్కులు దేశ మంతటా శూన్యం గావించబడ్డాయి.

## ప్రజాసారస్వతం - విశిష్టత

బూర్జువా సారస్వతం కంటె విషయంలోనూ, రూపం లోనూ ప్రజా సారస్వతం ఎన్నోరెట్లు ప్రజలకు సన్నిహితమైనది. ఇందలి ఆదర్శాలు, నీతులూ, వగైరా బూర్జువా ఆదర్శాలు, నీతులకు అనేక విషయాల్లో విరుద్ధమై వాటికంటె ఎన్నోరెట్లు ఉన్నతమైనవి. విశాలమైనవి. అంతేగాక కొద్దిమంది పైతరగతులకు మధ్య తరగతికి చెందిన వాళ్ల జీవిత విషయాలనుంచీ కోటానుకోట్ల శ్రామిక ప్రజల జీవిత విషయాలు సాహిత్య విషయంగా మారడం మన వాఙ్మయ చరిత్రలో ఇదే మొదలు. రచయితలు గూడా ఇదివరకటి కంటె ఎన్నోరెట్లు హెచ్చుగా సాధారణ రైతుకూలీ ప్రజానీకం నుంచీ, విద్యార్థి యువకుల నుంచీ వస్తున్నారు. వీరు మామూలు మనుషులూ జీవిత విషయాల్లో ప్రేక్షకులూ ఎంతమాత్రం గాదు. వివిధ ప్రజా ఉద్యమాల్లో చురుకుగా పాల్గొంటూ చైతన్య వంతులైన వారు. రచనకు యిది ప్రథమ ప్రయత్నమైనా కొంతమంది తమ చైతన్య బలం తోటీ తాము స్వీకరించిన ప్రజా వస్తువు యొక్క మహిమ

వల్లా అనేకమంది కొమ్ములు దిరిగిన బూర్జువా రచయితల కంటె చక్కని సజీవ రచనల్ని చేశారు.

1942 లో కమ్యూనిస్టు పార్టీపై నిషేధం తొలగిన నాలు గైదు సంత్సరాల్లోనే శ్రామిక ప్రజానీకంలో 60 సంవత్స రాల బూర్జువా జాతీయోద్యమాల ఫలితంగా కలిగిన సంచల నాన్ని మించి ఎంతో సంచలనం కలిగింది. యుద్ధకాలంలోనూ యుద్ధానంతరమూ విపరీతంగా పెరిగి పోయిన నిత్య జీవితావసర పదార్థాల ధరలు ఫలితంగా వివిధ కార్మికులూ, వ్యవసాయ కూలీలూ, పేద మధ్య తరగతి రైతుల్లోనూ, విద్యార్థులు, ఉపా ధ్యాయులు, చిన్న ఉద్యోగస్థుల్లోనూ, నావికులు, సైనికులు, పోలీసులు వగైరాల్లోనూ ఇదివరకెప్పుడూ కనివిని యెరుగనంతటి చైతన్యం కలిగింది. పార్టీ వివిధ రంగాల్లో వివిధ సమయాల్లో గావించిన ప్రచారాందోళనలు ప్రజానీకంలో మంచిప్రబోధాన్ని కలిగించాయి. అందుకు వివిధ ప్రజారూపాల్లో అభివృద్ధి చెందిన ప్రజాసాహిత్యం విరివిగా పొడ్డపడింది. ప్రతి సంవత్సరం ఆయా మహాసభల ద్వారానూ, రైల్వేకార్మికుల, ఆంధ్ర తెలంగాణా, బెంగాల్, మలబారు వగైరా ప్రాంతాల రైతాంగం సాగించిన పోరాటాలు, బొంబాయి నావికులు, కలకత్తా విద్యార్థుల విప్లవ పోరాటాలఫలితంగానూబుర్రకథలు,జానపదగేయాలు,నృత్యాలు, నాటికలు, వగైరాలలో ప్రజా నాట్య మండలి, వైజ్ఞానిక దళాలు చేసిన వైజ్ఞానిక ప్రచారం ద్వారానూ సహాయ నిరా కరణోద్యమం, ఉప్పు సత్యాగ్రహోద్యమాలనాటి సభల, సమా వేశాల స్థాయిని మించి ప్రజా సమీకరణ జరిగింది. 1942 సంక్షోభాన్ని పోరాటాన్ని మించి పోరాటం జరుగుతోంది.

కాని యీ పోరాటాలు దేశ పరివ్యాప్తం కాకపోవచ్చు. తత్ఫలితంగా 1946 లోని ఆ సంకుచిత ఓటింగు విధానంలోనే లక్షల కొలది ఓట్లు పార్టీకి లభించాయి. గత ఎన్నికల్లో పార్టీ గణించదగిన ఘన విజయాలు సాధించింది. కాంగ్రెసుకు ప్రథమ ప్రతిపక్షంగా పార్టీ వచ్చింది. మొన్నటి రాష్ట్రాందోళనతో ప్రజాతంత్ర పోరాటం అత్యున్నత స్థాయినందుకుంది. ఇష్టం లేని కేంద్ర ప్రభుత్వం నుంచి రాష్ట్రాన్ని గుంజుకో కలిగింది.

వస్తువులోనూ, రూపంలోనూ, ఆదర్శాల్లోనూ, దృక్పథంలోనూ బూర్జువా సాహిత్యం కంటె అన్ని విధాలా విలక్షణమైన యీ సాహిత్యం ఆర్థిక రాజకీయాది సర్వతోముఖ దృక్పథంతో లోగడ కంటె ప్రజా జీవితానికి చాలా సన్నిహితమైనది. బూర్జువా సాహిత్యంలోని అర్థమానవత్వాదర్శం నుంచీ ప్రజా సారస్వతంలో పూర్ణ మానవత్వాదర్శా న్నందుకోడానికి ప్రయత్నం సాగింది. అలాగే ఆర్థిక రాజకీయ సాంఘిక వ్యతిరేక శక్తుల పైన, సామ్రాజ్య వాదదుష్ట శక్తులపైన బూర్జువా సారస్వతంలో ఎక్కడోగాని కన్పించని స్వాతంత్ర్య ప్రజాతంత్ర శాంతి పోరాట స్వభావం విప్లవతత్వం సుస్పష్టంగా యిందులో కన్పించసాగింది.

## లోపాలు

అయితే, ఉద్యమం యింకా స్పష్టమైన ఒకరూపు తీసుకోక పోవడం వల్ల రాజకీయ రంగంలో మితవాద సంస్కరణవాద, వర్గ సామరస్య ధోరణులు ఉద్యమస్థాయిని పెంపొంద

కుండా అరికట్టి నట్లే - అభ్యుదయ రచయితల ఉద్యమం లోనూ, అభ్యుదయ సాహిత్యంలోనూ గూడా పొడసూపిన బూర్జువా పోకడలు పోరాట (సిద్ధాంత సమర) స్వభావం తగ్గించి సరియైనమార్గంలో ఏపుగా పెరగకుండా నిరోధించాయి. ఉద్యమ నాయకులు బూర్జువా నాయకుల్ని బూర్జువా రచయితలను నెత్తిన పెట్టుకొని పూజించి వారితో భావసంఘర్షణ సిద్ధాంత సమరాల ద్వారా యువకులైన ప్రజా రచయితల సిద్ధాంత పరి జ్ఞానాన్ని, చొరవనూ రచనాశక్తినీ, అభివృద్ధి చేయడానికి ఎంత మాత్రం పూనుకోలేదు. అంచేత, ఉద్యమం ప్రారంభమైన పిమ్మట అయిదారు సంవత్సరాల్లోనూ హెచ్చుభాగం అనువా దాలూ, అనుసరణాలేగాని, సారవంతమైన స్వతంత్రరచనలు విరివిగా ఉత్పత్తి గాలేదు.

రచయితల మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంత స్థాయి నభి వృద్ధి జేయడానికి నాయకత్వం సక్రమ మార్గంలో కృషి చేయ లేదు. పైపెచ్చు ఉద్యమం మీద తమ వర్గ దృక్పథాన్ని, స్వభా వాన్ని పూర్తిగా మార్చుకొనని, మార్చుకోడాని కిష్టపడని బూర్జువా రచయితల ప్రాబల్యం హెచ్చు గావటం వల్ల ప్రజా రచయితల రచనా పాటవం మొక్కవోయింది. అది చివరికి ఉద్యమ విచ్ఛిన్నతకు గూడా దారిదీసి రచయితల నిర్మాణ శక్తి పైనా, సృజనా శక్తిమీద దెబ్బతీసింది. ఆంధ్రభాషా సాహిత్య చరిత్రలను సునిశిత శాస్త్రీయ పరిశీలనాదృష్టితో జీర్ణంగావించు కొని, నూతన సాహిత్య సృష్టికి పూనుకోవడంలో రచయితల ప్రయత్నం తక్కువేననీ చెప్పాలి. పెదపూడి సాహిత్య పాఠశాల యీ విషయంలో కొంత ప్రాథమిక దోహద మిచ్చియున్న

మాట వాస్తవమే. ఈ రకంగా కొంత అభివృద్ధి పొందిన ప్రజా ఉద్యమాలన్నిటిమీంద నాటి కాంగ్రెసు ప్రభుత్వాలు అమలు జరిపిన ఫాసిస్టు నిర్బంధ విధానంవల్ల, ప్రజాశక్తిని నిషేధించి ప్రజాశక్తి కార్యాలయాల్ని ధ్వంసం గావించి, ఇంకా అనేక పత్రికలపై నిషేధాజ్ఞలు, సెక్యూరిటీ ఉత్తరువులు జారీ చేయడం వల్ల రచయితల అభివృద్ధీ, సారస్వతాభివృద్ధి పూర్తిగా దెబ్బతిన్నాయి. ఇప్పుడిప్పుడే తిరిగి తేప్పరిల్లు కొంటున్నాయి కాని, నిర్మాణ బల హీనత వల్ల ప్రజల ఆర్థిక దుస్థితివల్ల రావలసినంతగా పైకి రాలేక పోతున్నాయి.

## కర్తవ్యాలు

అయినా నిజమైనస్వాతంత్ర్యంకోసం, నూతనప్రజాతంత్రం కోసం, సుస్థిర శాంతి కోసం జరుగుతోన్న నేటి యీ తీవ్రసమరంలో సాహిత్య వస్తువూ, సాహిత్య రూపం అభివృద్ధి పొందే సూచనలున్నాయి. అలా అభివృద్ధి పొందవలసిన అవసరం గూడా లోగడకంటె నేడు ఎంతో ఎక్కువయింది.

కనుక, రచయితలు ప్రస్తుత జాతీయ అంతర్జాతీయ విప్లవపరిస్థితుల వినూత్న వాతావరణంలో తమపైబడిన చారిత్రాత్మక కర్తవ్యాన్ని పూర్తిగా నిర్వర్తించుకోవాలంటే మును ముందుగా యీ దిగువ కర్తవ్యాలను నెరవేర్చుకోవాలి.

1. వివిధ జీవిత సమస్యలను - వివిధ ప్రజల మనస్తత్వాన్ని భాషనూ ఇంకోధికంగా అర్థం చేసుకోడం
2. మార్క్సిస్టు - లెనినిస్టు విజ్ఞానాన్ని పెంపొందించుకోవడం

3. జాతీయ అంతర్జాతీయ పరిస్థితుల విస్తృత శాంతి వాతా వరణాల్ని సరిగా అవగాహన చేసుకోవడం

4. ప్రపంచంలోని వివిధ దేశాల, జాతుల చరిత్రలను మార్క్సిస్టు దృక్పథంతో అధ్యయనం గావించడం

5. భారతదేశ చరిత్రను, ఆంధ్రుల చరిత్రను ఇటీవలి బూర్జువా జాతీయోద్యమ చరిత్రతోసహా మార్క్సిస్టు దృక్పథంతో క్షుణ్ణంగా పరిశీలించడం

6. వివిధ సారస్వత సమస్యల్లో పరిజ్ఞానం, శిల్పవిజానం సంపాదించుకోవడం

7. ప్రపంచంలోని వివిధ జాతుల ఉత్తమ సాహిత్యాల్ని - వాటి చరిత్రలనూ అవలోడన చేయడం

8. వివిధ శాస్త్రకళా సారస్వత చరిత్రలను పరిశోధించడం

9. ప్రపంచంలోని వివిధభాషాకుటుంబాల చరిత్రలను, భాషా శాస్త్ర మూలసూత్రాలను మార్క్సిస్టు దృష్ట్యా అవ లోకించడం

10. ఆంధ్రి భాషా వాఙ్మయ చరితల్ని సవిశేషంగా అధ్య యనం గావించడం మొదలైనవి.

అయితే, ఒక ముఖ్య విషయం గమనించాలి. శాంతి, స్వాతంత్ర్య - అభ్యుదయాల కోసం జరిపే పోరాటం ద్వారానే లభిస్తుంది. చెడును వివిధ రంగాల్లోనూ, వివిధ రూపాల్లోనూ ప్రతిఘటించడంలోనే శాంతి చేకూరుతుంది. ఆత్మరక్షణ రహిత మైన ప్రతిఘటనా శూన్యమైన లొంగుబాటుతత్వం శాంతిగాదు.

యుగయుగాల అశాంతినీ నిర్మూలించడానికి సుస్థిర విశ్వశాంతి సాధనకు స్వాతంత్ర్య ప్రజాతంత్రాలకోసం పోరాడాలి. శాంతి మన ధ్యేయం! స్వాతంత్ర్యం మనలక్ష్యం! అభ్యుదయం మన గమ్యం! పోరాటంగానీ, ఐక్యతగానీ, ఇంకేదైనాగానీ వీనికి సాధనాలు మాత్రమే.

ఈ సందర్భంలో శంఖానర్తపద్ధతిలో జరిగే అభివృద్ధిని గురించి కామ్రేడ్ స్టాలిన్ ప్రవచించిన యీ క్రింది అమూల్య సూత్రాన్ని మనం మన ఆచరణకు మార్గదర్శకంగా తీసుకోవాలి.

"పోరాట పద్ధతిలోనూ, వైరుధ్యాలు వృద్ధిపొందే పద్ధతిలోనూ, ఈ వైరుధ్యాలను అధిగమించే విధానంలోనూ, ఈ వైరుధ్యాలను వెలుగులోకి తెచ్చి వాటిని తొలగించే పద్ధతిలోనూ మనం పురోగమిస్తున్నాం".

1950

# కళాశాస్త్రవాఙ్మయాలూ - కమ్యూనిజం

౧

## విమర్శ - విమర్శకుడు

తెలుసుకోడానికీ విమర్శకూ తేడా ఉంది. కాని, విడదీయ రాని పరస్పర సంబంధంగూడా ఉంది. తెలుసుకోడానికి విమర్శ అవసరం. విమర్శకు తెలుసుకోడం కావాలి. తెలిసిన ప్రతి ఒకడూ మంచి విమర్శకుడు కాలేకపోవచ్చు. కాని, విమర్శకుడు ప్రతి ఒకడూ తప్పకుండా తెలిసినవాడు కావాలి. సరిగా విమర్శించగలగడం అంటే చక్కగా, స్పష్టంగా తెలుసుకోవడం అన్నమాట. కనుక, విమర్శలో విషయ పరిజ్ఞానం ప్రముఖ స్థానాన్ని ఆక్రమించుకొంటుంది.

విమర్శనలో విమర్శకుడిమీద అనేక బాధ్యతలు పడతాయి.

1. ఒక విషయాన్ని విమర్శించేముందు సాధ్యమయినంతవరకు ఆ విషయాన్ని గురించి సమగ్రంగా సాంగోపాంగంగా తెలుసుకోవాలి.

2. అలా విమర్శించడంలోనూ, విశేషించి దాన్ని ఆచరణలో పెట్టడంలోనూ వచ్చే నూతనానుభవాల్ని పురస్కరించుకొని తన విజ్ఞానంయొక్క లోతునూ, వైశాల్యాన్నీ పెంపొందించుకోవాలి.

3. ఆ యా విషయాల్ని తెలుసుకున్నంత మాత్రాన చాలదు. అందలి మంచిచెడుగుల్ని ఎత్తిచూపించే విచక్షణాశక్తి ఉండాలి.

4. దాంతో ఆచరణలోవచ్చే మంచిచెడ్డలకు సమష్టిబాధ్యతతో బాటు వ్యక్తి బాధ్యతకూడా ఉంటుంది. అంచేత ఆత్మవిమర్శ విమర్శలో ప్రముఖపాత్ర వహిస్తుంది.

5. కాబట్టి, విమర్శనాశక్తిగల ప్రతి ఒకడూ సమస్యాపరిష్కారంలో నిమగ్నుడుకావాలి. అప్పుడే ఆచరణలోవచ్చే చిక్కులేమిటో, తత్పరిష్కార మార్గాలేమిటో కనిపెట్టగలడు.

6. కనుక కమ్యూనిస్టు విమర్శనా పద్ధతి అంటే, సిద్ధాంతాచరణాల పరస్పర సంబంధ సమన్వయ పరిశీలనమన్నమాట.

విమర్శ కేవలం విమర్శకుడి పాండిత్యం, తెలివితేటలమీద మాత్రమే ఆధారపడి ఉండదు. అది యింకా అతడిజీవితం, అనుభవం, ప్రవర్తన, శీలం వగైరా ముఖ్యమైన అనేక విషయాలమీదగూడా ఆధారపడి ఉంటుంది. అన్నిటికిమించి, అతడి వర్గదృష్టి, ప్రపంచాన్నిగురించిన అతని దృక్పథం (వరల్డ్-ఔట్-లుక్) మీద ప్రధానంగా అతని విమర్శ ఆధారపడి ఉంటుంది.

విమర్శకుడు బాహ్యావస్తు పరిశీలనం (ఆబ్జక్టివ్ స్టడీ) విశేషంగా చేయాలి. అప్పుడే ఆత్మపరం (సబ్జక్టివ్) గా గూడా ఆలోచించి చర్యకూ, ప్రతిచర్యకూ గడంగగలడు.

28-8-54

# భౌతికజగత్తూ - మేధావి జగత్తూ

[మెటీరియల్ వరల్డ్ అండ్ స్పిరిచ్యుయల్ వరల్డ్]

భౌతికజగత్తు నంటిపెట్టుకొనే దానిమీద ఆధారపడే మేధావి జగత్తు ఉంటుంది. కనుక తాను స్వయంగాగానీ, యితరులుగానీ జ్ఞానేంద్రియాల (సెన్సారీ ఆర్గన్స్) ద్వారా గ్రహించిన లేక అనుభవించిన అన్ని విషయాలనూ, తాము చేసిన, చేస్తున్న, చేయబోయే ప్రతి పనినీ గురించి సునిశితంగా పరిశీలించగలగాలి పోల్చుకోగలగాలి. ఆలోచించగలగాలి.

కనుక, ఆయా యుగాలలోని ఉత్పత్తిపరికరాలు, ఉత్పత్తివిధానం ఉత్పత్తిసంబంధాలమీద, ఆయా యుగాలలోని మనిషి యొక్క ఆదర్శాలు (ఐడియాలజీస్) సిద్ధాంతాలూ, ఆలోచన పరంపరలూ, వీటితోగూడుకొన్న రాజకీయాలూ, కళలూ, శాస్త్రాలూ, వాఙ్మయం మొదలయినవి ఆధారపడి ఉంటాయి. విమర్శ వీటన్నిటిలోనూ ఉపయోగపడుతుంది. అనుస్యూతంగా ఉంటుంది. ఉదాహరణకు: రాజకీయ విమర్శ, కళావిమర్శ, సాహిత్యవిమర్శ, శాస్త్రవిమర్శ మొదలైనవి.

కాగా, బాహ్యవస్తు పరిశీలనం (ఆబ్జక్టివ్ స్టడీ), ఆత్మపరమైన పరిశీలనం (సబ్జక్టివ్ స్టడీ) యీ క్రింది విధంగా జరుగుతాయి.

1. విభజనాత్మక అధ్యయనం (ఎనలిటికల్ స్టడీ)
2. సాధర్మ్య వైధర్మ్య పరిశీలనం (కంపారిటివ్ స్టడీ)
3. సంయోగా (సంకీర్ణా)త్మక అధ్యయనం (సింథటికల్ స్టడీ)

శాస్త్రీయమైన గతి తార్కిక, చారిత్రక భౌతికవాద పద్ధతితోగూడిన విమర్శలో పై విధంగా జరిపే త్రివిధాధ్యయనం ఉంటుంది.

ఉత్పత్తిసాధన విధాన సంబంధాలలో వచ్చే విప్లవకర మైన మార్పులతోబాటు మనిషియొక్క అనుభవం ఆలోచనా శక్తీ, విమర్శనాశక్తీ అభివృద్ధిబొందీ, రాజకీయాలూ, కళలూ, శాస్త్రాలూ, వాఙ్మయం వగైరాలలోగూడా విప్లవకరమైన మార్పులు జరుగుతాయి. ఈ విప్లవకర పరివర్తనలతో తిరిగి మనిషియొక్క విమర్శనాశక్తిలోగూడా అభివృద్ధి వస్తుంది.

భౌతిక జగత్తులో వచ్చిన విప్లవంవల్ల మేధావి జగత్తులో గూడా విప్లవం జరుగుతుంది. ఈ విప్లవం ఫలితంగా ఒక సరి కొత్త చైతన్యస్రవంతి సామాజిక జీవితంలో ఎదురులేని ఉరవ డితో ఉరకలువేస్తూ ప్రవహిస్తుంది. ఈ చైతన్యం గతితార్కిక చారిత్రక భౌతికవాద విమర్శాత్మక జ్ఞానానికి, తత్పూర్వక విప్లవ కార్యాచరణకూ ఫలితం. ఈ చైతన్యం తిరిగి భౌతికజగత్తులో అనగా ఉత్పత్తిపరికరాలు, ఉత్పత్తివిధానం, సాంఘిక సంబంధా లలో విప్లవం తీసుకొస్తుంది. అంచేత, గతితార్కిక చారిత్రక భౌతిక వాదాత్మక విమర్శనా పద్ధతియే నిజమైన ప్రజాబోధనా పద్ధతి (పాప్యులర్ మెథడ్ ఆఫ్ ఎడ్యుకేషన్) ఇది ప్రజల చైత న్యానికి రూపు దిద్దుతుంది.

## సిద్ధాంతాచరణలూ - విమర్శ

ప్రస్తుత పరిస్థితులూ, ప్రస్తుత సిద్ధాంతాలూ - ఆచర ణలోవచ్చే చిక్కులు సమస్యలు, వీటికి సంబంధించిన విమర్శ నాత్మక పరిజ్ఞానంవల్లనే నూతనపరిష్కార మార్గాలు, నూతన సిద్ధాంతాలు కనిపెట్టబడతాయి. కాగా, నూతన సిద్ధాంత స్థాపనకు ఎప్పుడూ యిలాంటి విమర్శనాత్మక వస్తు పరిజ్ఞానం అవ

సరం. సిద్ధాంతానికి పూర్వ దశయే విమర్శ. అది తిరిగి కొన్ని అప్పుడమలులో ఉన్న సిద్ధాంతాల మీదనే ఆధారపడి ఉం టుంది. ఆచరణకు, సిద్ధాంతానికి మధ్య కలిపే గొలుసు వంటిది విమర్శ. విమర్శా ఫలితమే సిద్ధాంతం. ఆచరణలో వచ్చే మంచి చెడ్డల నెంచడమే విమర్శ. తద్వారా విధినిషేధాలను వక్కా ణించడమే సిద్ధాంతం. సిద్ధాంతానికి రూపు దిద్దేది విమర్శ. విమర్శనాత్మక ఆచరణ లేనిదే విమర్శనాత్మక సిద్ధాంతం అభి వృద్ధి జెందలేదు. ఏ సిద్ధాంతాన్నిగూడా ముక్కుకు సూటిగా వర్తింప జేసి విచక్షణా రహితంగా, విమర్శన జ్ఞానశూన్యంగా ఆచరణలో బెట్టరాదు. అట్టిది ఒక్కొక్కప్పుడు ఎంతో ప్రమా దానికి దారి దీస్తుంది. ఉత్తమ సిద్ధాంత మెప్పుడూ మృదులమై ఒక విధంగా వంగు స్వభావం (ఫ్లెక్సిబిలిటి) కలిగి ఉంటుంది. కనుక, విమర్శ ఎప్పుడూ సిద్ధాంతాచరణలలో లీనమై, సమ్మి ళితమై అంతర్గర్భితమై ఉంటుంది.

సాంఘిక అస్తిత్వంతో బాటు, ఈ విమర్శనాత్మక సిద్ధాంత పరిజ్ఞానంతో గూడుకొన్న ఆచరణ వల్లనే సమాజం లేక వ్యక్తి ఎప్పటికప్పుడు నూతన చైతన్యాన్ని పొందుతుంది. అలాంటి ఆరని చైతన్యం తోనే సమాజం విప్లవం తరువాత విప్లవం సాధించ గలుగుతుంది. మజిలీ వెనుక మజిలీని చేరుకో గలుగుతుంది. ఈ చైతన్యమే యిప్పుడింకా రెండు వంతుల ప్రపంచంలో అమ లులో నున్న వర్గ సమాజాన్ని రూపుమాపి, వర్గరహిత సమా జాన్ని స్థాపించ గలుగుతుంది.

కళా శాస్త్రాలు గానీ, వాఙ్మయం గానీ అభ్యుదయ కరంగా ఉండాలంటే అవి గతితార్కిక చారిత్రక భౌతిక వాదా

త్మక విమర్శనా దృష్టితో నిరుష్టంగా ఉండాలి. ఆ విధమైన విమర్శలేని నాడు వీటిలో కుళ్లు చేరుతుంది. మురికి పేరుకు పోతుంది. సరియైన, సునిశితమైన అట్టి విమర్శలోనే యెప్పటి కప్పుడు కుళ్లును ఖండించివేసి, మురికి కడిగివేసి, నూతనత్వాన్నీ, సజీవత్వాన్నీ, ఉజ్వలత్వాన్నీ అన్ని రంగాల్లోనూ నిలుపుకోగలం.

## ప్రజాజీవితం – కళాశాస్త్రి వాఙ్మయాలూ

కొంతమంది – రాయిస్టులు వగైరా అనుకొన్నట్లు కళా వాఙ్మయ విజ్ఞానాలు సాధారణ ప్రజాజీవితానికి అతీతమైనవేమీ కాదు. అవి కేవలం చదువుకొన్న వాళ్లకూ, సంస్కారం బొం దిన వాళ్లకూ మాత్రమే ఉద్దేశింప బడేవీ, ఉపయోగించేవీ గావు. ఎందుకనంటే, వ్రాయడం, చదవడంద్వారానే కేవలం ప్రజలకు సంస్కారం అబ్బడం లేదు. ఈనాటి ప్రాథమిక విద్యలో నేర్చుకొనేది బహు స్వల్పం. అది గూడా చాలా కొద్ది మందికే (15%) లభిస్తుంది. అలాంటి ప్రాథమిక విద్యగూడా పూర్తిచేయ కుండా యిందులో అరగొరగా చదివి మధ్యలో సరిపించుకొనే వాళ్లు అనేకమంది. అంతమాత్రాన ప్రజానీకంలో కళా వాఙ్మయ విజ్ఞానాలకు సంబంధించిన బీజాలు బొత్తిగా లేనడం సరిగాదు. కాగా, ప్రజా బాహుళ్యంలో ఇలాంటి సంస్కారం, చైతన్యం తమ పూర్వీకుల నుండి వారసత్వం (హెరిటేజ్) గా వచ్చేవిగాక మొదటినుంచీ యింకా అనేక మార్గాలు ద్వారా కలుగుతున్నాయి. అవి ఆనాటి కానాడు ఎక్కువవుతున్నాయి. రాజకీయ ప్రచారం, పాటలు, పద్యాలు, పురాణాలు, హరి కథలు, బుర్రకథలు, నాటకాలు, సినిమాలు, గ్రామఫోనులు,

రేడియోలు, వ్యాపారాలు, వ్యవహారాలు, బస్సులు, రైళ్లు మొదలైన రాకపోకల సౌకర్యాలు ఒకటేమిటి? ఈ నాటి యావత్తు సాంఘిక వ్యవస్థ. దాన్ని మార్చడానికే, నిత్య జీవితావసరాలు, సమస్యల కోసం తామెడ తెగకుండా జరిపే నిత్య పోరాటాలే ముఖ్యంగా ప్రజల్లో సరియైన సంస్కృతినీ, నిజమైన జాగృతినీ కలిగిస్తున్నాయి. ఇవే ఆయా కళాశాస్త్రాల్లో ప్రతి బింబిస్తున్నాయి. అట్టి చైతన్యమే ప్రజల జీవితాన్ని తీర్చి దిద్దుతుంది. భవిష్యత్తును నిర్ణయిస్తుంది. అంతేగాదు అసలు ప్రజలే సాహిత్యానికి ఆధారమూ, పునాదీని. ప్రజలూ, ప్రజా జీవితమూ సాహిత్యానికి జీవగర్ర. వారే నిజమైన సాహిత్య స్రష్టలు. రచయితలు సాహిత్యానికి రూపురేకలు దిద్దువారు మాత్రమే. ప్రజా జీవితం అసంస్కృతమైన ముడిలోహమయితే రచయితలు దానిని తమ అనుభవ భావాల మూసలో కరగించి విషయాను గుణమైన, తమ యిచ్ఛ వచ్చిన ప్రజారూపం అనే అచ్చులో పోతబోస్తారు.

## కళాశాస్త్ర వాఙ్మయాలు - సాధర్మ్య వైధర్మ్యాలు

సంస్కృతి ద్వివిధం. కళలు అనీ శాస్త్రాలు అనీ. కనుక జీవితానుభవం గూడా కళానుభవం అనీ, శాస్త్రీయానుభవం అనీ రెండు రకాలుగా ఉంటుంది. కళలు ఆంతర ప్రవృత్తుల్నీ, ఆంతరంగిక వాస్తవికతను ప్రధానంగా చిత్రిస్తే, శాస్త్రం బాహ్య వాస్తవికత మీద ప్రధానంగా ఆధారపడుతుంది కనుక బాహ్య వాస్తవికతా పరిజ్ఞానం శాస్త్రం. ఆత్మపరిజ్ఞానం

(మనల్ని మనం తెలుసుకోడం) కళ, కాని, అది రెండూ ఒండొం టిపై తమ ప్రభావాల్ని ప్రసరింప జేసుకొనడం వల్ల ఒకదానిలో ఒకటి చొచ్చుకు పోవడం వల్లా ఒక దానిని మించి ఒకటి ప్రబల ములై ముఖ్య పదార్థాన్ని మార్చివేస్తాయి. అంతేకాదు. అను భవాల శాస్త్రమే కళ. జ్ఞానం తాలూకు కళయే శాస్త్రం. కనుక ,మనం చేయగలగడం ఎలాగో తెలుసుకోవాలి. కాని ఏమి చేయాలో తెలుసుకోడానికి గాను మనం అనుభవించాలి. కళ సామాజికజీవిత పోరాటం లోనే ఉద్భవిస్తుంది. కారణం సమాజంలో వాస్తవికతకూ ఊహాగానానికి మధ్య ఎడతెగ కుండా సంఘర్షణ జరుగుతూ ఉంటుంది. శాస్త్రం మానవుడు తన భౌతికావసరాల కోసం సౌకర్యాల కోసం చేసే నిత్య పరి శోధనలో ఉద్భవిస్తుంది. అభివృద్ధి గాంచుతుంది. కళలూ, శాస్త్రాలు రెండూ కలిసి పూర్తి జీవితాన్ని, వాస్తవికతనూ ప్రదర్శిస్తాయి. కళగానీ, శాస్త్రంగానీ ఏ ఒకటి పూర్తి జీవి తాన్ని ప్రదర్శించ జాలదు. ఏ ఒకదాని వల్లనో కలిగేది పాక్షిక (అర్ధ) విజ్ఞానం మాత్రమే.

కళలు మూడురకాలు. శ్రవ్యాలు, దృశ్యాలు, ఉభయాలు అని. శబ్ద (ధ్వని) ప్రధానాలైన సంగీతం, కవిత్వం, కథలు రేడియో నాటికలు మొ. శ్రవ్యకళలు. రూప ప్రధానాలైన చిత్ర శిల్పా దులు గృహోపకరణాలు మొ. దృశ్య (రూప) కళలు. నృత్యం, నాటకం, సినిమా మొ. ఉభయకళలు లేక పూర్ణకళలు. అలాగే శాస్త్రాలుకూడా ముఖ్యంగా మూడురకాలు. సజీవశాస్త్రాలు, నిర్జీవ శాస్త్రాలు, లేక సాంఘిక శాస్త్రాలు, ప్రకృతి (భౌతిక) శాస్త్రాలు, ఉభయ శాస్త్రాలు అని.

కళలకూ శాస్త్రాలకుగూడా భాష అమూల్యమైనదే. కాని కళలభాష వేరు. శాస్త్రాలభాషవేరు. కనుక వాఙ్మయం త్రివిధం. కళావాఙ్మయం, శాస్త్రవాఙ్మయం ఉభయ వాఙ్మయం అని. అయితే వాఙ్మయ ప్రధానంకాని కళలూ, వాఙ్మయ ప్రధానంకాని శాస్త్రాలూ ఉండవచ్చు. కాని కళాశాస్త్రాలకు సంబంధించని వాఙ్మయం ఉండనేరదు.

అదీగాక, ప్రజాజీవితంలో యివి మూడూ విడివిడిగా ఉండనేరవు. వీటి బీజాలూ వీటి ప్రభావం జీవితం అంతటా అనుక్షణం పెనవేసుకొనే ఉంటాయి. ఇవన్నీ గలిసి ఒకే ప్రజాజీవితాన్ని వికసింపజేయడానికి అభ్యుదయంవైపుకు నడిపించటానికీ అనుక్షణం తోడ్పడుతున్నట్టి విభిన్నదృక్కోణాలు, వివిధ పద్ధతులూ, రూపాలూను.

సౌలభ్యంకోసం, విశేషాభివృద్ధికోసం, మొసలుతీర్చి ముందుకు వేగంగా ప్రజాజీవితాన్ని నడపడంకోసం సమాజం వానిని విడదీసి ప్రత్యేకంగా శాఖోపశాఖలుగా అభివృద్ధిచేసుకొంటూ పోతోంది. కాని అంతమాత్రంచేత అవి జీవితంలో ఒకదానినుండి మరొకటి వేరుపడి ఉండవు. ఒకదాని ప్రభావం ఇంకోదానిమీద తప్పనిసరిగా పడుతుంది. ఆర్థికశాస్త్రంలో వచ్చిన మార్పు రాజకీయ సాంఘికాది వివిధ శాస్త్రాల్లోగూడా మార్పు కలిగిస్తుంది. ఉదా: మార్క్స్ వ్రాసిన 'క్యాపిటల్'. అలాగే ప్రకృతి శాస్త్రాల్లో ఒకటైన పదార్థ విజ్ఞాన శాస్త్రంలో జరిగిన ఒక కొత్త పరిశోధన తదితర ప్రకృతి శాస్త్రాల్లోనూ, సాంఘిక శాస్త్రాల్లోనూగూడా వెంటనే మార్పు దీసుకొస్తుంది. ఉదా: అ.ణుశక్తి, విద్యుచ్ఛక్తి మొ. కనుకనే మార్క్స్ మహాశయుడు

ఒక్క-అర్థశాస్త్రవిషయాలనేచర్చించి ఊరుకోలేదు. తత్వశాస్త్రం, రాజకీయశాస్త్రం వగైరా తదితర శాస్త్రాల్లోనూ, చరిత్ర, సాహిత్యం మొదలైనవాట్లోనుగూడా కృషిజేసి వాటి నన్నిటినీ ఒకే దృక్పథంతో, ఒకే ముఖ్యాదర్శంతో సమన్వయపరచాడు. మానవ సమాజాన్ని కలవరపరుస్తోన్న అనేక ప్రధానసమస్యలకు మూలకారణాన్ని కనిపెట్టి వాటికి పరిష్కా-రమార్గాన్ని చూపాడు.

అంతేగాకుండా ఉత్పత్తి పరికరాల్లోను, శాస్త్రీయ విషయాల్లోనూగూడా పరిశోధించి ఒక కొత్తసాధనాన్నీ, ఒక కొత్త విషయాన్నీ కనిపెట్టినప్పుడు అవి వెంటనే సాంఘిక సంబంధాలలోనూ, వివిధ జీవితశాఖల్లోనూ, వివిధ శాస్త్రాల్లోనూ, కళావాఙ్మయాల్లోనూగూడా విషయంలోనూ, రూపంలోనూ అద్భుతమైన ప్రభావం, పరివర్తనకలిగిస్తాయి. తద్వారా మొత్తం సాంఘిక వ్యవస్థనే మార్చడానికి దోహదమవుతాయి. నిప్పు, నాగలి, విల్లమ్ములు, మగ్గం తుపాకి, ఆవిరియంత్రం, రేడియో, అణుశక్తి వగైరా లిందు కుదాహరణాలు. సమగ్ర మానవ సమాజ చరిత్ర సధ్యయనంచేసేవారి కిందు కుదాహరణలు కోకొల్లలుగా లభిస్తాయి. వివిధ యంత్రాలు, వైజ్ఞానిక పరిశోధనలు ఒక్కొ-క్క-టీ యిటీవలి సామాజిక వ్యవస్థలో ఎట్టి విప్లవ పరివర్తనల్ని తీసుకొస్తుందీ మనం చూస్తూనే ఉన్నాం. ఉదాహరణకు: అచ్చుయంత్రం కనిపెట్టిన తరువాత పుస్తకాలు, పత్రికలు, కరపత్రాలు వగైరా అనేకం వెంటవెంటనే అచ్చువేయడం ద్వారా అనేకమంది సులభంగా చౌకగా పుస్తకాలు మొ. కొని చదువుకోగలుగుతున్నారు. ప్రాచీనకాలంలో చదువుకొన్న వాళ్లు చాలా అరుదుగా ఉండేవాళ్లు. ఆ కొద్దిమందికూడా ఆస్తి,

తీరికాగలిగి ప్రజాపీడకులైన పై వర్గాల్లో మాత్రమే ఉండేవాళ్లు. వెనకటికంటె విద్య సులభంగానడంవల్ల కలిగిన సాంఘిక చైతన్యం ఫలితంగా సాంఘిక వ్యవస్థలో అనేక విప్లవాలు సులభతర మయ్యాయి. అలాగే ఆవిరియంత్రాలు, ఎలెక్ట్రిసిటీ, రేడియో వగైరా కనిపెట్టడంతో అన్ని రంగాల్లోనూ అద్భుతమైన మార్పు లెన్నో కలిగాయి. నేడు అణుశక్తి ఉత్పత్తిరంగంలో విప్లవం తీసుకొస్తుంది.

సామాజిక ఉత్పత్తి విధానంలో శ్రమ విభజన జరిగి నప్పటినుంచీ, సామాజిక జీవితం తాలూకు అన్నిరంగాల్లోనూ యీ అభివృద్ధి ఉరకలతో దాట్లతో అనుదినం ముందుకుపోతూనే ఉంది. ఈ విషయాన్ని గురించి మార్క్సు యిలా వివరించాడు.

"ఉత్పత్తికి సంబంధించిన వివిధ సాంఘిక శాఖల విభాగం వల్ల వర్తకపు సరుకులు ఎక్కువ నాణ్యంగా తయారుచేయబడ తాయి. వివిధ శక్తులుగల మనుషులు తమతమ అభిరుచులూ, నైపుణ్యాలకు తగిన పనులనూ, రంగాలనూ ఎంచుకొంటారు. ఏమాత్రం నియమ నిర్బంధాలూ లేకుండా ముఖ్యమైన ఫలితా లేవీ యెక్కడా లభించజాలవు. అంచేత శ్రమ విభజనవల్ల సరు కుతోబాటు ఉత్పత్తి చేసేవాడుగూడా అభివృద్ధి అవుతాడు."

[మార్క్సు-కాపిటల్ సం... ఎల్లేన్ యూనియన్ డోనాటోర్ పేజీ 359]

"అంచేతనే వైదికసమాజంలోనివర్ణవ్యవస్థగానీ, వృత్తితో ఏకీభవించినంతవరకూ అటుపిమ్మటి కులవ్యవస్థగానీ యింతగా స్థిరంగానడానికి పునాది దొరకింది."

[ఇండియా ప్రిమిటివ్ కమ్యూనిజం టు స్లేవరీ పేజీ-109]

ఒకప్పుడు స్థూలంగా జరిగిన శ్రమవిభజన యీనాడు విజ్ఞానం పెరిగినకొలందికీ యంత్రాలు అభివృద్ధి అవుతున్న కొద్దీ, సూక్ష్మాతిసూక్ష్మంగా, చిలవలు పలవలుగా జరిగిపోతోంది. శ్రమ విభజన యిలా చిలవలు పలవలుగా జరుగుతున్న కొలందికీ అన్ని రంగాల్లోనూ అభివృద్ధికూడా అలాగే అంతు లేకుండా సాగిపోతోంది. అయితే వెనక, ముఖ్యంగా మన దేశంలో మతానికీ, శ్రమవిభజనకు సంబంధించిన వర్ణకులాలకూ ముడిబెట్టడం ఎక్కువయింది కనుక ఈ వర్ణకులాలు కదుగట్టి సులభంగా మార్చుకోడానికవీల్లేకపోయింది. అంచేత సమగ్రసాంఘికాభివృద్ధి జరగకుండా చాలవరకు అరికట్టబడుతుండేది. నేడు వెనకటివర్ణాలు, కులాలతో నిమిత్తంలేకుండానే వాటి నధిగమించి నూతన వృత్తులనేకం కొన్ని పాతవాటితోసహా అమలులోనికి వస్తున్నాయి.

## సామ్రాజ్యవాదదశలో శ్రమ విభజన

అయితే నేడు యీ శ్రమవిభజనను కృత్రిమంగానూ, క్లిష్టంగానూ జేసి విదేశ గుత్తపెట్టుబడిదారీవర్గం స్వలాభాన్ని అభివృద్ధిజేసుకోడంకోసం చూస్తోంది. ఉదాహరణకు ఒక యంత్రాన్ని తయారుచేయడానికి, ఒకేచోట తక్కువ ఖర్చుతో పూర్తిచేయడానికి అవకాశాలున్నా, బుద్ధిపూర్వకంగానే దూర దూరంగా ఉన్న ప్రదేశాల్లోనూ, దేశాల్లోనూ దాని తాలూకు వివిధభాగాలను తయారుచేయిస్తుంది. కారణం మరేంలేదు. వలస దేశాల్లో యంత్రపరిశ్రమ ఎక్కడ అభివృద్ధి అయిపోతాయో అనే భయమే. దీనికి అనుగుణంగానే విద్యావిధానాన్ని గూడా అసమగ్రంగానూ లోపభూయిష్ఠంగానూ జేసివేస్తోంది. కాడ్వెల్

చెప్పినట్లు "క్లిష్టమైన యీ శ్రమవిభజనలో మనిషిసయితం విభ జించబడుతున్నాడు. ఒకే ఒకపని అభివృద్ధికై తదితర శారీరక మానసిక శక్తులన్ని బలికావించబడుతున్నాయి." ఈ విధంగా సామ్రాజ్యవాద దేశాలకూ, వలస దేశాలకుమధ్య పరిశ్రమల్లోనూ విద్యావిధానంలోనూ ఎంతో అఘాతం పెంచివేస్తుంది. వలస దేశాల్ని తమ పరిశ్రమలకుగావలసిన ముడిపదార్థాలను ఉత్పత్తి జేసి చౌకగా సరఫరాజేసే ఖానిసదేశాల్నిగా జేసివేస్తోంది. ప్రాజెక్టులనూ, పరిశ్రమలనూ, సాంకేతిక విద్యలనూ అభివృద్ధి చేయకుండా యువకులను నిరుద్యోగులుగా మార్చివేసి, ఏదో తమకు కావలసినంతమట్టుకు గుమాస్తాలనూ, కీలుబొమ్మలను తయారుచేసుకోడానికిగాను మరెందుకూ పనికిమాలిన చదువు చెబుతోంది. తద్వారా విద్యార్థుల్లోకలిగే అసంతృప్తినీ, సాంఘిక చైతన్యాన్ని దారుణ నిర్బంధ విధానంతో అరికట్టచూస్తోంది. మానవజాతి విజ్ఞానాన్ని యీ రీతిగా సమగ్రం గాకుండా సంకు చితంగావిస్తోంది. నిర్దిష్టంగాకుండా లోపభూయిష్ఠంజేస్తోంది. అందు వల్లకలిగే అనర్థాలకెన్నిటికో కారణం అవుతోంది. ఉదాహరణకు: ఎంతగా చదువుకొన్నప్పటికీ ఒకమనిషి నేడు తన కడుపులో నొప్పికి కారణం కనుక్కోలేకపోతున్నాడు. పట్టపరీక్షలెన్నియిచ్చి నప్పటికీ ఒక ప్రొఫెసరు సరియైన అనుభవజ్ఞానం శూన్యమగుట వల్ల అతని విద్యలో అలాంటి అవకాశాలు హెచ్చుగా లేకపో వడంవల్ల, ఆచరణలో అన్నివిధాలా అనుభవంకలిగిన తనక్రింది డెమాన్‌స్ట్రేటరుకు కొన్నివిషయాల్లో తీసిపోతున్నాడు. ఇదే సోవియట్‌లో అయితే ఇందుకు పూర్తిగా భిన్నంగా ఉంటుంది. అక్కడ మనిషికి గావలసిన అన్నివిషయాల్లోనూ మొట్టమొదట

కనీస విజ్ఞానాన్ని పొందడానికి పూర్తి అవకాశాలుకల్పించి, అటు పిమ్మట అతనికి అభిరుచిగల విద్యలో ప్రత్యేకంగా నిష్ణాతుడు (స్పెషలిస్టు) అగుటకు కావలసిన అన్ని సౌకర్యాలు కల్పిస్తుంది అక్కడి సోవియట్ ప్రభుత్వం. పెట్టుబడిదారీ దేశాల్లో విద్యార్థి యొక్క అభిరుచికేమాత్రం ప్రాముఖ్యత యివ్వబడదు. విద్య కేవలం వ్యాపారపద్ధతుల్లోమాత్రమే నేర్పబడుతుంది. అతని తల్లి దండ్రులుగూడా అందుకే ప్రోత్సహిస్తారు. చివరికి విద్యార్థిసయితం తన అభిరుచిని తాను పరిగణించక ఏది ఎక్కువ లాభప్రదమయితే దానినే నేర్చుకోడానికి సిద్ధపడతాడు. పెట్టుబడిదారీ సాంఘిక వాతావరణమంతా యిందుకు బాగా దోహదమిస్తుంది. ఫలితం: కళాప్రమాణాలు, విద్యా వైజ్ఞానిక ప్రమాణాలు క్షీణించి తిరో గమించి పతనదశకు సిద్ధంగావడమే!

౭

## విశ్వసాహిత్యం - కమ్యూనిజం

అంతేగాకుండా, లాభంకోసమే ఉత్పత్తి సాగించబడుతూ ఉన్న యీ పెట్టుబడిదారీ సమాజంలో కళావాఙ్మయ విజ్ఞానాలు ప్రజలకు దూరం గావడమో వ్యతిరేకం గావడమో, అర్థం గాకుండా, అందుబాటులో లేకుండా పోవడమో, వ్యర్థం గావ డమో, లేక ప్రజలకు పూర్తిగా ఉపయోగించేవీ అభ్యుదయ కర మయ్యేవీ అయినప్పుడు అవి అణచివేయ బడడమో జరు గుతూ ఉంది. కాని, ఆర్థిక రాజకీయాది ప్రయోజనాల కోసం జీవిత ప్రమాణం, పెంపొందించుకోడానికి, నిత్యమూ జరిపే పోరా టాల్లోనే ప్రజల విజ్ఞాన ప్రమాణం గూడా పెరుగుతుంది.

క్రమంగా యివి అభివృద్ధి పొందుతాయి. పై అనర్థాలనుంచి తప్పించ బడతాయి. విప్లవం జయప్రదమై, కమ్యూనిజం వైపు మానవ సమాజం పురోగమిస్తున్నకొలందికీ ఇవి పూర్తిగా ప్రజలందరివీ అయిపోతాయి. అంటే ప్రజలందరూవీనిని పూర్తిగా తమ కందుబాటులోకి తెచ్చుకొని అర్థం జేసుకోడానికీ, ఆనందించడానికీ, తత్ఫలితాలను అనుభవించడానికీ శక్తిగలవాళ్లవుతారు. అవి సయితం ప్రజాజీవితాన్ని మార్చడానికి శక్తిగలవి అవుతాయి. అయితే, ఒకవిషయం: ఏనాడో కమ్యూనిజం తానంతటదే వస్తుందిగదా అనిచెప్పి ఇవేళ మనం చేతులు ముడుచుకుర్చోరాదు. ఇవేళా, రేపూచేయవలసినపని చేస్తేనే కమ్యూనిజం అమలులోకి వస్తుంది. ప్రస్తుతం మనదృష్టిలో కమ్యూనిజం 'మన చరమలక్ష్యం. నిజమైన స్వాతంత్ర్యమూ, నూతన ప్రజాతంత్రమూ, మనతక్షణాశయాలు. అందుకు గావలసిన సర్వతోముఖమైన బలం, సాధన సంపత్తీ సమకూర్చుకోవాలి. ప్రజలను చైతన్యవంతులను గావించి అందుకు సిద్ధపరచాలి. రష్యాలో సమాజం సోషలిస్టు వ్యవస్థనుంచీ కమ్యూనిస్టు వ్యవస్థకు అప్పుడే పరివర్తన జెందుతోంది. అందు కవసరమైన బ్రహ్మాండమైనకమ్యూనిస్టుప్రణాళికలుఅమలుజరపబడుతున్నాయి. తూర్పు యూరపు రాజ్యాలు, ఉత్తర కొరియా, చైనాదేశాలు నూతనప్రజాతంత్రదశనుంచీ సోషలిస్టు దశలోకి పరివర్తన గాంచుతున్నాయి.

## కమ్యూనిజం ఒక సమగ్ర జీవితవిధానం

కనుక, కమ్యూనిజం సాధించబడేది. అది ప్రత్యక్షంగా నేడొకవైపునుంచీ సాధించబడుతోంది. స్టాలిన్ 1947 కు పూర్వమే

కమ్యూనిజం ఒక దేశంలోనైనా సరే సాధించవచ్చని చెప్పాడు. ఇదివరకు ప్రపంచమంతటా విప్లవం వస్తేనే సోషలిజం ఏర్పడుతుందనీ, ప్రపంచమంతటా సోషలిజంఏర్పడితేనే కమ్యూనిజం అమలులోకి రావడానికి వీలవుతుందనే పొరపాటు అభిప్రాయాలు ఉండేవి. కాని, రష్యాలోని ప్రస్తుతానుభవం ద్వారా అవి అవసరం లేదని తేలింది. ఆహారం మొదలయిన కొన్ని ముఖ్య విషయాల్లో అప్పుడే అక్కడ కమ్యూనిస్టు విధానం అమలు జరుపబడుతోంది. మూడవవంతు ప్రపంచం నేడు కమ్యూనిస్టు ఆధిపత్యంలో ఉంది. లోగడ బూర్జువా రాజకీయ వేత్తలు దుష్ప్రచారం చేసినట్లు కమ్యూనిజం నేడొక కల గాదు. అది ప్రపంచ ప్రజలందరికీ కనుచూపుమేరలో కనబడుతోన్న ప్రత్యక్ష సంపూర్ణ సత్యం. అదిఒక సమగ్ర జీవిత విధానం. సుశిక్షితమైన సర్వజన సుఖప్రదమైన, సకలజనులకూ సర్వతోముఖాభ్యుదయానికి సకలావకాశాలు గలిగిన సామాజిక సమష్టి జీవితవిధానం.

## సామ్రాజ్యవాదులకుట్రలు-ప్రపంచప్రజల కర్తవ్యాలు

అది కేవలం ప్రశాంత పరిణామం ద్వారా దానంతటదే ఏర్పడేదిగాదు. వర్గసంఘర్షణ తీవ్రతరం జేయడం ద్వారానే అది సులభమూ, సుసాధమూ అవుతుంది. నేడు కొద్దిమంది దీనికి పరమ శత్రువులై అడ్డు దగులుతున్నారు. ముఖ్యంగా పెట్టుబడిదారీ దేశాల్లోని ప్రజల్నీ, యుద్ధాల ద్వారా మానవ సమాజాన్నంతటినీ, చెమటోడ్చి ఏళ్లతరబడి కూడబెట్టుకొన్న కళా విజ్ఞానాల్నీ, వివిధ సంపదల్నీ తమ స్వార్థం కోసం అల్లకల్లోలం జేసి వేస్తున్నారు. నాగరికతను సంస్కృతినీ ధ్వంసం గావిస్తు

న్నారు. అంచేత వీళ్లను పరిమార్చేనే అందరికీ స్వాతంత్ర్యం, శాంతీ అభ్యుదయం చేకూరుతాయి. వీళ్లుకొద్దిమందే అయినా, ఆయా దేశాల్లోని ప్రభుత్వయంత్రాలను నేడు మిత్రరాజ్యసమితినీ తమ చెప్పుచేతల్లో పెట్టుకొని దురాక్రమణలుగావించి అనేకమాయో పాయాలద్వారా బానిసత్వం గావించి ప్రపంచ మంతటిపై పెత్త నం చలాయించాలనుకొంటున్నారు. తమ అందరి యోగ క్షేమాల కోసం వీళ్లను ప్రతిఘటించి నిర్మూలించే బాధ్యత ప్రపంచ ప్రజలందరిమీద ఉంది. ప్రజా బాహుళ్యం యొక్క స్వాతంత్ర్య శాంత్యభ్యుదయాల కోసం ప్రజా శత్రువులైన యీ కొద్దిమంది తోటీ తగిన విధంగా పోరాటం కొనసాగించాలి. పెట్టుబడిదారీ ప్రపంచమంతటా ఉన్న యీ ప్రజా శత్రువుల ప్రజాశాంతి స్వాతంత్ర్యాభ్యుదయ వ్యతిరేక చర్యలకు ప్రపంచ మంతటా ఉన్న ప్రజా ఉద్యమాల పరస్పరసానుభూతి సహకారా లతోటీ, బలంతోటీ ఎదుర్కొని పోరాడాలి. ప్రపంచ పరివ్యాప్త మైన యీ శాంతి స్వాతంత్ర్య పోరాటాల ద్వారానే ప్రపంచ సాహిత్యం మరొక్కసారి జాజ్వల్యమానంకాగలదు. స్థిరమైనపునా దిలో వెలుగొందగలదు. కళాశాస్త్రవాఙ్మయాలకూ, ప్రజలకూ మధ్య వాటిలో వాటికి నడుమాఉన్న కృత్రిమమైన అఘాతాలు ఈపోరాటాలద్వారా క్రమంగా పూడిపోయి, వర్గభేదాలతోబాటు ఉన్న యీ భేదాలన్నీ క్రమంగా ఒక్కొక్కటీ మాయమాయం కాగ లవు. కమ్యూనిస్టు వ్యవస్థలో ప్రజలందరికీ అన్నిరంగాల్లో ఉన్నత స్థాయి లభించగలదు. అంతేగాకుండా ఆయా జాతీయసాహిత్యా లలో ఉన్న సంకుచిత తత్వం మళ్లామళ్లాకూడా పూర్తిగా రూపు మాసిపోయి విశ్వసాహిత్యంగా వివిధభాషల్లో వెలుగొందగలదు.

# సోవియటు సాహిత్యం ప్రత్యేకత

1917 రష్యన్ విప్లవంతోటి అక్కడ సోషలిస్టు వ్యవస్థ ఏర్పర్చబడి దినదిన ప్రవర్ధమానం గానడంతోటీ లెనిన్ స్టాలిన్ మాక్జిం గోర్కీలాంటి ప్రముఖ రచయితల ఉత్తమ కృషితోటీ మార్క్సు ఏంగెల్సులచే ప్రారంభించబడ్డ యీ విశ్వ సాహిత్యానికి సుస్థిరమైన పునాదులపుడే నెలకొల్ప బడ్డాయి. అటు పిమ్మట సోవియటు ప్రజలచే సోవియటు సాహిత్యం నిర్మించబడింది. బోల్షివిక్ పార్టీ, సోవియట్ ప్రజలూ సాధించిన మహత్తర విజయాల ననేకమంది ఉత్తమ రచయితలు ప్రతిబింబించి, కమ్యూనిస్టు సమాజానికి ప్రథమదశగా కార్మికవర్గ నియంతృత్వాన్నీ, ద్వితీయదశగా సోషలిజాన్నీ చిత్రించారు. పంచవర్ష ప్రణాళికలను, అవి ఆచరణలో వివిధ రంగాల్లో తీసుకొస్తోన్న అద్భుతమైన మార్పులనూ చక్కగా సోషలిస్టు వాస్తవికతతో చిత్రించారు. సమష్టి వ్యవసాయాన్నీ, సమష్టి జీవితాన్ని గురించి వ్రాసిన వాటిలో 'షోలకోవ్' వ్రాసిన 'బీళ్లుదున్నేరు' (వర్జిన్ సాయిల్ అప్ టరన్డ్) 'డాన్'నది ప్రశాంతంగా ప్రవహిస్తోంది' (అండ్ క్వైట్ ఫ్లోస్ ది డాన్) అనేవి ఉత్తమ తరగతికి చెందినవి. 'ఫర్మనోవ్' వ్రాసిన 'ఛాపయేవ్' అనే నవలను 'ఫిల్ము' తీశారు. నికాలాయ్ ఓస్ట్రోవిస్కీ వ్రాసిన 'ఉక్కు ఎలా పదునుచేయబడ్డది' (హౌది స్టీల్ వాజ్ టెమ్పర్డ్), 'సెరాఫిమోవిచ్' వ్రాసిన 'ఇనుప వెల్లువ' (ఐరన్ ఫ్లడ్) మొదలయిన నవలలు అప్పుడే ప్లాను ప్రకారం అభివృద్ధిబొందుతున్న పరిశ్రమలగూర్చి చిత్రించినవి. ఎ. ఎ. ఫెడయేవ్ రచించిన 'యువ రక్షకుడు' (యంగ్ గార్డ్)

సుప్రసిద్ధమైనది. అలెక్సీటాల్‌స్టాయ్ రష్యన్ ప్రభువర్గాన్నుంచి వచ్చినవాడు. అనేక నాటకాలు వ్రాశాడు. 'ఇల్యాఎహ్‌రెన్బర్గ్ గత యుద్ధసమయంలో 'పారిస్ పతనం' (ఫాల్ ఆఫ్ పారిస్) యుద్ధానంతరం మొన్న మొన్ననే 'తుపాన్' (స్టారమ్) అనే గొప్ప నవలను ఇంకా అనేక సుప్రసిద్ధ వ్యాసాలను వ్రాశాడు. 'వాండా వాసిలెవ్‌స్కా' 'ఇంద్రధనుస్సు' (రెయిన్‌బో) మొదలయిన నవలల్లో నాజీ హింసాకాండను 'ఆదర్శప్రేమ'లో అత్యుదాత్తమైన ఆదర్శప్రేమనుస్పష్టంగాచిత్రించింది. అటుతరువాత 'మాస్కో సుదూరంనుంచి' (ఫార్ ఫ్రమ్ మాస్కో) మొ॥ అనేక నవలలు వచ్చాయి. 'మాయకోవిస్కీ' రష్యన్ విప్లవాన్ని వివిధ కోణాల్లో వివిధపద్ధతుల్లో తనమధురోదాత్తమయిన కవిత్వంలో ప్రతిబింబించాడు. 'కాన్‌స్టాంటిన్ సిమొనోవ్' మొదలైనవారు యీ నూతన యుగంలో పెరిగినవారే. వీరందరూ గొప్ప ప్రజాబోధకుడూ, సాహిత్య నిర్మాత అయిన 'గోర్కీ' మహాశయుని రచనలచే ఉత్తేజితులూ, ఉద్బోధితులూ, శిక్షితులూ అయినవారే!

అలాగే 'ఆరగాన్' మొదలయిన ఫ్రెంచికవులూ, పాబ్లో నెరూడా మొదలయిన అమెరికన్ కవులూ, జాన్‌ల్యూయిస్, రాల్ఫ్‌ఫాక్స్, క్రిస్టఫర్ కాడ్‌వెల్ మొదలయిన ఇంగ్లీషు రచయితలూ, ముల్కరాజ్ ఆనంద్ మొదలయిన అభ్యుదయ భారతీయ నవలాకారులూ, 'లూసాన్' మొదలయిన చైనా విప్లవ రచయితలూ యీ విశ్వసాహిత్యానికి పట్టుగొమ్మలై యీ యుగంలో దానినెంతో విస్తృతపర్చి ముందుకు తీసుకుపోయారు. అలాగే పికాసో, కుక్రినిస్కీ మొదలైన కళాకారులు తమ కళాఖండాలతో జగద్విఖ్యాతులయ్యారు. లైసెంకో, జాలియట్

క్యూరీ, జె. బి. యస్. హాల్డేన్, జి. డి. బెర్నాల్ మొదలైన శాస్త్రవేత్తల కృషి యీ దశలో ముఖ్యంగా కొనియాడదగ్గది. వీరందరూ ఆయాదేశాల్లోని ప్రజలనేగాక ప్రపంచప్రజలనందరినీ చైతన్యవంతుల్ని జేశారు. కళలకూ, రాజకీయాలకూ ఉన్న అవినాభావ సంబంధాన్ని సుస్పష్టం గావించారు.

తూర్పు యూరపుదేశాల్లోనూ, కొరియా చైనాల్లోనూ నూత్న ప్రజాస్వామికవ్యవస్థ ఏర్పడ్డంతోటీ వలసబానిసదేశాల్లోని స్వాతంత్ర్యోద్యమాలతోటీ, సామ్రాజ్యవాద దేశాల్లోని ప్రజా ఉద్యమాల కృషిఫలితంగానూ యీ విశ్వసాహిత్యం విస్తరిల్లింది. ఈ ఉద్యమాలన్నీ పూర్తిగా జయప్రదమయ్యేటప్పటికి యీ విశ్వ సాహిత్యంలో కనివినియెరుగని విప్లవంవచ్చేస్తుంది. విప్లవానంతరం విపులమైన చైనా ప్రజాసాహిత్యం ప్రపంచ ప్రజల కందుకోంది.

3

## ప్లానుప్రకారం ఉత్పత్తి - ఉత్పత్తిలో అభివృద్ధి

ఉత్పత్తి సౌకర్యం కోసం, ఉత్పత్తి అధికం గావడంకోసం తొలుత శ్రమ విభజన జరిగింది. దాంతో సామాజికోత్పత్తిలో ఎంతోమార్పు, అభివృద్ధి వచ్చింది. అది నిర్బంధమై సాంఘిక సంబంధాలలోగూడా అనేక విషమ పరిణామాలకు దారితీసింది. బానిస భూసామ్య వ్యవస్థలకు కారణమయింది. తరువాత లాభం కోసం పోటాపోటీలతో ఉత్పత్తి జరిగింది. తద్వారా ఉత్పత్తి పెరిగింది. కేంద్రీకృతమయింది. కోటీశ్వరులైన పెట్టుబడిదారులు బయలుదేరారు. పెట్టుబడిదారీసమాజానికి బీజావాపం జరిగింది. అది అవతరించింది. ఈ విధానంలో ప్లానుప్రకారం ఉత్పత్తిగానీ, పంపకం గానీ జరగవు. లాభం కోసం మాత్రమే జరుగుతాయి.

అంచేత ఉత్పత్తిలో పంపకంలో అరాచకం పెచ్చు పెరిగి, ప్రతిష్టంభ నను దారితీసింది. మార్కెట్లకోసం సామ్రాజ్యాలూ, సామ్రాజ్యాల కోసం సామ్రాజ్యవాదయుద్ధాలూ పెచ్చు పెరిగాయి. ప్రజల అవస రాలుగూడా విపరీతంగా పెరిగిపోయాయి. ఒక వైపు తీరనికరువు. మరొక వైపు అంతులేని నిల్వలు. అయినా జీవితప్రమాణం పడి పోయి ప్రజల కొనుగోలుశక్తి తగ్గిపోయింది. ఈ వైరుధ్యాలను బహి ర్గతమొనర్చి వాటిని తొలగించడంకోసం విప్లవం, ప్లాను ప్రకారం ఉత్పత్తి, పంపకం అవసరమయ్యాయి. అంచేత ప్రథమ ప్రపంచ యుద్ధ పర్యవసానంగా రష్యాలో సోషలిస్టు విప్లవం-తో సోషలిస్టు వ్యవస్థ. ద్వితీయ ప్రపంచయుద్ధఫలితంగా తూర్పుయూరపు, తూర్పు జర్మనీ, ఉత్తరకొరియా, చైనా దేశాల్లో నూతన ప్రజాతంత్ర వ్యవస్థ ఏర్పడి సామ్రాజ్యాలు, వలస పెట్టుబడిదారీ రాజ్యాలు ఒకొక్కటే శిథిలమై మటుమాయం కాజొచ్చాయి.

ఈ విధానంలో ప్లాను ప్రకారం దేశానికి కావలసినంత ఉత్పత్తి చేయబడి కేంద్రీకృతమూ అవుతుంది. ఆయా ప్రాంతాల్లో ప్లాను ప్రకారం ఉత్పత్తి దారులకు తిరిగి పంచబడుతుంది. పరిశ్ర మలు జాతిపరం గావించబడి అభివృద్ధిజెంది బస్తీలతోబాటు వివిధ సౌకర్యాలు గలిగి పల్లెలుగూడా అభివృద్ధి జెందుతాయి. పల్లెలకూ బస్తీలకూ ఉన్న తేడాలుగూడా మటుమాయ మవు తాయి. మిగతా ప్రపంచ మంతటిలోనూ యీ పద్ధతి విజయ వంతమయ్యే రోజులు నానాటికి దగ్గరపడుతున్నాయి. రష్యన్ విప్లవం ద్వారా వచ్చిన మహత్తర అనుభవాలు, కలిగిన అద్భుత ఫలితాలు కార్మికవర్గం అధికారానికి వచ్చిన దేశాల్లో నేడు ఆచరణలో పెట్టబడుతున్నాయి. అవి పూర్తిగా ప్రపంచ

మంతటా ఆచరణ లోనికి రావాలంటే యింకా ఎన్నో పోరా టాలు, విప్లవాలు జరగవలసి ఉన్నాయి. ప్రపంచ మంతటా శిథిలావస్థలోనున్న సామ్రాజ్య వాదానికి, పెట్టుబడిదారీ ప్రభు త్వాలకు వ్యతిరేకంగా అనుదినం యీ పోరాటాలు సాగుతూనే ఉన్నాయి. జర్మనీ, ఇటలీ, జపానుల్లో గూడుగట్టిన ఫాసిజం రూపుమాసిందిగదా అని ప్రపంచ ప్రజలు నేడు ఆత్మసంతృప్తి చెందడంలేదు. శిథిలావస్థలో కొన ఊపిరితో మిగిలిఉన్న యీ సామ్రాజ్యవాద విషబీజాలు ఆయా దేశాల్లో పెట్టుబడిదారీ ప్రభుత్వాలు యిచ్చే దోహదంతో మారురూపులో మొలకెత్తి యించు మించు ఫాసిస్టుస్వరూపాన్నే దాల్చుతున్నాయి. ప్రజా శక్తులు ఈ ఫాసిస్టు విషబీజాలను నిర్మూలించడానికి రోజురోజూ ముందుకువచ్చి విజృంభిస్తున్నాయి. సోవియటు రష్యా తన విప్లవ అనుభవాలద్వారా సాధించిన అద్భుత విజయాలద్వారా యీ ప్రపంచ ప్రజా ఉద్యమాల కన్నిటికీ, ఆశాజ్యోతిగా మార్గ దర్శిగా నాయకత్వం వహిస్తోంది.

## క్షీణ సారస్వతం - వివిధ రూపాలు

నశించిపోతున్న బూర్జువాసమాజపు దుష్టలక్షణాలు, సామ్రాజ్యవాదపు వికృత స్వరూపాలు, దుష్టఫాసిస్టు విషబీజాలే మొలకెత్తి అనేక వెఱ్ఱితలలువేసి విచిత్రరూపాలతో కళాశాస్త్ర వాఙ్మయాల్లో సయితం ప్రతిబింబించసాగాయి. అస్తిత్వవాదం (ఎగ్జిస్టెన్షలిజం), తాత్విక శూన్యతావాదం (ఫిలసాఫికల్ నిహిలిజం) అతీత మానవత్వవాదం (సూపర్ మ్యాన్ థీరీ) శుద్ధకళా, శుద్ధ శాస్త్రవాదాలు మొదలయినవాటితోగూడిన రచనలు చావ

డానికి సిద్ధంగాఉన్న పెట్టుబడిదారీ వర్గాన్నీ, ఆవ్యవస్థనూ తత్పరిణామాలనూ ప్రత్యక్షంగానో పరోక్షంగానో సమర్థించేవే. నానాటికీ అభివృద్ధి అవుతూ, ఉన్నతమూ, ఉజ్వలమూఅవుతున్న మానవ స్వభావాన్ని హీనపరిచి, మనస్తత్వ చిత్రణ పేరుతో నిరాశా, నిస్పృహలూ, ఆత్మహత్యలూ, హత్యలూ, చౌర్యాలూ వ్యభిచారాలూ, మొదలయిన వివిధ నేరాలూ చేయడమే మానవస్వభావంగాచిత్రించి, వాటివల్లే మానవుడు దారిద్ర్యమూ మొదలయిన బాధలలో నిత్యదుఃఖితుడవుతున్నాడనీ, అసలవి మనిషి తప్పనిసరిగా అనుభవించవలసినవేననీ, 'జీవితమే అంత' అనీ బలవంతుడే జీవించడానికి కర్హుడనీ, బలహీనుడు దనర్హుడనీ, అతనికి మరణమే శరణ్యమనీ, యుద్ధాలు మానవ ప్రకృతి సిద్ధాలనీ యీ విధంగా యిప్పటి బూర్జువా వ్యవస్థలోని లోపాలకు నిజమైన మూలకారణాలను మభ్యపరచి మానవుని పతనానికి దారితీసే వివిధ విషయాలతోగూడిన రచనలను కథలు, నవలలు, నాటకాలు, వ్యాసాలు మొదలయిన వివిధ రూపాల్లో బూర్జువా వర్గ ప్రతినిధులయిన రచయితలు చేస్తున్నారు. జీన్‌పాల్ సార్త్రే బెట్రాండ్ రస్సెల్ మొదలయినవాళ్లు యీ రకమైన క్షీణసారస్వతాన్ని సృష్టిస్తున్నారు. వర్గపోరాటాన్ని ప్రక్కదారులకు మళ్లించడానికే యివి ప్రధానంగా ఉద్దేశించబడుతున్నాయి.

సర్రియలిజం, సింబాలిజం, ఎక్స్‌ప్రెషనిజం, డాడాయిజం, ఇమేజిజం, ఫార్మలిజం, నేచురలిజం మొదలయిన 'ఇజమ్స్' (వాదాలు) గూడా పెట్టుబడిదారీ సమాజం క్షీణదశతోబాటు దానిని ప్రతిబింబించేదాని సాహిత్యంలోగూడా వచ్చిన క్షీణదశనే సూచిస్తాయి. క్రుళ్ళిపోతున్న పెట్టుబడిదారీవ్యవస్థను ఎలాగో ఒకలాగు

నిలబెట్టాలనే కోరికలోనే యివన్నీ బయలుదేరాయి. జీవితం మీదా, ప్రజలమీదా చివరికి మానవత్వంమీద సయితం విశ్వాసం గోల్పోయిన నిరాశావాదులు (పెస్సిమిస్ట్సు) లేక ద్వేషాన్ని క్రక్కే మానవ వ్యతిరేకులు త్రొక్కిన పెడదారు లివి. విషయంలోనూ, రూపంలోనూ యివి ప్రజలకు దూరమై, వ్యతిరేకమై నశించిపోయే పెట్టుబడిదారీవర్గంతాలూకు సాహిత్య వృక్షం పూచిన విషపుష్పా లివి. నిరాశావాదులైన రచయితల ఆత్మసంతృప్తికోసం, కోరటకోసం పుట్టినవేగాక, ఇందుల్లో కొన్ని ఉద్దేశపూర్వకంగా ప్రజాజీవితాన్ని, ప్రజాసాహిత్యాన్ని కలుషితం జేయడానికే బయలుదేరాయనేది స్పష్టం. ఈ మధ్య కాంగ్రెసు ప్రభుత్వ నిర్బంధ విధానదశలో అమెరికన్ కామసాహిత్యపు గాడిలో ఆంధ్రదేశంలో సయితం కామసాహిత్యం వెలువడి ప్రజాజీవితాన్ని కలుషితమొనర్చడానికి ప్రయత్నించి విఫలమయింది. ప్రజల్లో రాజకీయాది ప్రచారంవల్లకలిగిన ప్రబల నైతిక శక్తిముందు పరాజితమయింది.

పైగా వాళ్లు 'కళ కళకోసమే' అనీ, రాజకీయాలకూ కళకూ ఏమాత్రం సంబంధం ఉండగూడదనీ, మాది ప్రచార సాహిత్యంగాదు 'శుద్ధకళ' (ప్యూర్ ఆర్ట్) అనీ అంటారు. ఏవర్గం (కార్మికవర్గం) యొక్కా, ఏ పార్టీయొక్క ప్రచారం ఉండగూడ దంటూనే వాళ్లు డబ్బుసంచులవైపుకు, డబ్బుగల వర్గంవైపుకు చూస్తుంటారు. కళాశాస్త్రవాఙ్మయాల్లో పై వర్గాల ప్రయోజనాన్ని, వాళ్లప్రచారాన్ని పరోక్షంగానూ, ప్రత్యక్షంగానూ గూడా చేసిపెడుతుంటారు. తమ యజమానులకోసమే నిత్యమూ పనిజేస్తుంటారు. 'కాస్మాపాలిటనిజం' (ప్రపంచ పౌరత్వం), వసు

థైక ప్రభుత్వం వగైరా వాళ్ల నినాదాలు పెట్టుబడిదారీ వ్యవస్థను నిలబెట్టగోరేవాళ్లు ప్రజల్ని మభ్యపెట్టడానికి చేసే నినాదాలు మాత్రమే. అంతేగాదు. నేడు వాళ్ళీ నినాదాలచాటున ప్రపంచ మంతటినీ తమ గుప్పిట్లో పెట్టుకోవాలనే దురాక్రమణవాంఛ లతో అఱ్ఱులుచాస్తున్నారు. అవి ఉత్తరకొరియాపైన యుద్ధం చేయడం, ఫార్మోజా, ఇండోచైనా, ఫిలిప్పీన్స్‌లో సైనిక సహాయాలద్వారా. ఆంతరంగిక వ్యవహారాల్లో ప్రత్యక్షజోక్యంద్వారా స్పష్టపడ్డాయి. ట్రూమన్ యీ విషయం స్పష్టంగా చెప్పాడు గూడాను. కాశ్మీర్, ఇరాన్ మొ. దేశాల్లోని అమెరికాకుట్రలు జగద్విదితం.

విశ్వనాథ సత్యనారాయణ మొదలైనవారు సమాజాన్ని బూజుబట్టిన వర్ణాశ్రమ కులవ్యవస్థలలో గూడిన భూస్వామ్య, బానిసవ్యవస్థలవైపుకు తిరోగమింపజేయాలని తమ అభివృద్ధి నిరోధక రచనలద్వారా ప్రయత్నిస్తూ విప్లవ ప్రవాహాని కెదురీద జూస్తున్నారు. ప్రస్తుతం అధికారంలో ఉన్నంతమాత్రాన రోజు రోజుకూ కుళ్లిపోతూ ప్రజాబలాన్ని గోల్పోతూన్న పై వర్గాలను తమ నవలలు వగైరాలలో పొగడుతూ, దినదినాభివృద్ధిగాంచుతూ భవిష్యత్తును నిర్ణయించగల క్రిందివర్గాలపైన. వాని బలమైన సిద్ధాంతంమీద కేవలం కళ్లుమూసుకుని దుమ్మెత్తిపోస్తున్నారు.

## కళాశాస్త్ర వాఙ్మయాలు - ఆర్థిక వ్యవస్థ

కళాశాస్త్ర వాఙ్మయాలు ముఖ్యంగా సామాజిక ఆర్థిక వ్యవస్థమీద ఆధారపడి ఉంటాయి. సామాజిక అస్తిత్వాన్నీ, సామాజిక ఉత్పత్తి సంబంధాలనూ, తద్వారా కలిగే చైతన్యాన్ని ఇవి ప్రతిబింబిస్తుంటాయి. ఇవి సాంఘిక చైతన్యంతాలూకు విభిన్న

స్వరూపాలు. అంచేత యివి సామాజిక ఆర్థిక రాజకీయాది వ్యవస్థను, తత్సంబంధాలను మార్చడానికి తోడ్పడతాయి. కాని మార్క్సు చెప్పినట్లు యివి సాంఘిక అస్తిత్వాన్నే నిర్ణయించవు. పైపెచ్చు సాంఘిక అస్తిత్వమే వీటిని నిర్ణయిస్తుంది. అంతేగాక వీటిలో పరస్పరం ఒకదాని ప్రభావం యింకోదానిమీద తప్పని సరిగా పడుతుంది.

## ప్రస్తుత సమాజంలో విజ్ఞానాభివృద్ధి - ప్రజల కవకాశాలు తక్కువ

ఇప్పటివరకూ పెంపొందిన కళాశాస్త్ర వాఙ్మయాల ద్వారా మానవజీవిత రహస్యాలెన్నో బయలుపడ్డాయి. ఇంకా బయలుపడవలసినవానిలో యివి ఎన్నోవంతో చెప్పలేము. మానవుడు కనిపెట్టవలసిన, సాధించవలసిన విజ్ఞానం యింకా ఎంతో ఉంది. ఇంతవరకూ బహిర్గతమైన యీ రహస్యాలొక్కొక్కటే ఒక్కొక్క కళాఖండంగా, ఒక ప్రత్యేక శాస్త్రంగా, ఒక సాహిత్యరూపంగా తయారయినాయి. ఇవి అన్నీ పూర్తిగా ప్రజలందరికీ సోవియటు ప్రజారాజ్యాల్లోతప్ప యీ సమాజంలో అందుబాటులో ఉండవు. బాగా చదువుకొన్నవాళ్లకూ, ఆర్థిక పరిస్థితి బాగా ఉన్నవాళ్లకూ గూడా ఇప్పుడమల్లో ఉన్న ఉత్పత్తి విధానం, ఉత్పత్తి సంబంధాలవల్ల ఇంతవరకూ కనిపెట్టిన శాస్త్ర పరిశోధనాఫలితాలను అమల్లోపెట్టడం, ఉపయోగించడం మాట అలాఉంచి వివిధ శాస్త్రమూలసూత్రాలనే పూర్తిగా అవగాహనచేసుకోడానికి చాలినన్ని అవకాశాలు లేవు. అంచేత ఎలాంటివారికీ యీ పరిస్థితుల్లో యిలాంటి సర్వతోముఖ పరిజ్ఞా

నం సంపాదించడం అంటే ఎంతో కష్టసాధ్యమవుతుంది. అంచేతనే యీ సమాజంలో అలాంటివాళ్లు అరుదుగా మాత్రమే మనకు లభ్యమవుతున్నారు.

## విజ్ఞానం - శాఖోపశాఖలు

కళావాఙ్మయ శాస్త్రాల్లో చిలవలు పలవలుగా అనేక అవాంతరశాఖలు, రూపాలూ, పద్ధతులూ పెరిగిపోతున్నాయి. కళావాఙ్మయాలలో కంటె శాస్త్రవిషయాల్లోనే శాఖోపశాఖలు అనేకంగా పెరుగుతాయి. ఒక జీవితసత్యాన్ని, లేక ప్రాకృతికసత్యాన్ని, భౌతిక విషయాన్ని అన్వేషించడంలో ఒక్కొక్క శాస్త్రంగా అభివృద్ధి పొందుతుంది. ఆయా ప్రత్యేక శాస్త్రాల్లో నిష్ణాతులు (స్పెషలిస్టులు) బయలుదేరు తున్నారు. ఇలాంటి ప్రత్యేక శాస్త్ర నిష్ణాతుల ద్వారానే ఆయా విషయాలు అంతులేకుండా అభివృద్ధి చెందగలవు. అయితే, వారు కనీసం తదితర జీవిత శాఖల మూలసూత్రాలనైనా అవగాహన చేసుకొని ఉండాలి. కాని, సమాజంలో ఇలాంటి స్పెషలిస్టుల అవసరం ఎంత ఉందో, బహువిషయ పరిజ్ఞాతల, సర్వతోముఖ జీవిత పరిజ్ఞాతల అవసరంగూడా అంతేవుంది. ఉద్యమనిర్మాతలూ, రచయితలూ అట్టివారు కావాలి. ప్రస్తుతం మనకున్న యీ వర్గ సమాజ పరిస్థితుల్లో విజ్ఞానప్రచారం విరివిగా సాగవలసినరోజుల్లో యిలాంటివారి అవసరం ఎంతో ఎక్కువగా ఉంటుంది. సమాజాన్ని ఉన్న చోటనే ఉండిపోకుండానూ, మందకొడిగా నడవకుండానూ, వేగంగా సాగిపోయేట్లు చేయాలంటే, ఒక మహా విప్లవాన్ని జయప్రదంగా నడపాలంటే, యిలాంటి సర్వతోముఖ

పరిజ్ఞానం గలవాళ్ల సహాయమే హెచ్చుగా ఉంటుంది. ప్రజా జీవితం, ప్రజాభ్యుదయం అవిభాజ్యాలు గనుక ప్రజలకు ముందుండి నడపాలంటే, ప్రజల జీవితానికి సంబంధించిన విషయాలన్నీ చక్కగా తెలిసి ఉండాలి. ప్రతి పార్టీ సభ్యుడూ, రాజకీయ ప్రచారకుడూ యిలాంటివాడుగా తయారు గావాలి. ప్రతి కమ్యూనిస్టు పార్టీ సభ్యుడూ అలా తయారవుతాడు. కమ్యూనిస్టు పార్టీ సభ్యుడు అంటే బూర్జువా సమాజంలోని ఎంతో మంది స్పెషలిస్టుల కంటెనూ, బూర్జువా పార్టీల నాయకుల కంటేనూ, బూర్జువా మేధావుల కంటెనూ గూడా ప్రజా జీవిత సమస్యలను సరిగా శాస్త్రీయంగా అర్థం చేసుకోవడం లోనూ, ఖచ్చితమైన పరిష్కారమార్గాన్ని చూపించడంలోనూ, ఆచరణలో పెట్టడంలోనూ అడ్డంకుల నెదుర్కొనటంలోనూ ఎంతో శక్తి సామర్థ్యాలను కలిగి ఉంటాడు అన్నమాట. పై పద్ధతుల్లో ప్రతి పార్టీ సభ్యునీ తయారుచేయడమే కమ్యూనిస్టు పార్టీయొక్క ప్రత్యేకత.

## ప్రజానాయకులూ - ప్రజా రచయితలూ

కనుక ఇలాంటివారే నిజంగా మంచి ప్రజానాయకులూ (ఆర్గనైజర్స్) ఉత్తమ ప్రజా రచయితలూ కావడానికి అవకాశం ఉంటుంది.

ప్రజా నాయకుడు ప్రతిభావంతుడైన రచయిత గానీ, ఉపన్యాసకుడుగానీ అయిఉంటాడు. ప్రతిభావంతుడైన రచయిత తప్పక ప్రజా నాయకుడై తీరతాడు.

ఆర్థిక రాజకీయాలు సామాజిక జీవితాన్ని నిర్ణయిస్తాయి. నిర్మిస్తాయి. అంచేత, రాజకీయాలంటే సామాజికజీవితం తాలూకు విభిన్నరూపాలైన కళాశాస్త్ర వాఙ్మయాలయొక్క (క్రోడీకరింప బడిన) సారాంశం మాత్రమేగాక వాటి నిర్మాణానికీ, అభివృద్ధికీ ప్రత్యేకంగా ప్రత్యక్షంగా దోహదం చేసేవికూడా అవుతాయి.

కామ్రేడ్ స్టాలిన్‌కన్నా నేటి యీ ప్రపంచంలో ఉత్తమ రచయిత ఎవరు నిజానికి ? ఆయన ప్రతిభావంతుడైన రచయిత గాబట్టే ఉత్తమ ప్రజా నాయకుడు కాగలిగాడు. ఉత్తమ ప్రజా నాయకుడు గాబట్టే ప్రతిభావంతుడైన రచయిత కాగలిగాడు. మాగ్జింగోర్కీ, ఇల్యా ఎహ్రెన్బర్గ్, షోలకోవ్‌లాంటి రచయితలు ఉత్తమ ప్రజానాయకులు కారని ఎవరన గలరు ?

## రచయితలూ - విమర్శనాత్మక సిద్ధాంత పరిజ్ఞానం

నేటి విమర్శల్లో అనేక దృక్పథాలూ, పద్ధతులూ ఉన్నట్లు స్థూల దృష్టికి కన్పిస్తూ ఉంటాయి. కాని, ఆ యా దృక్ప థాలూ, పద్ధతుల వెనకాల ఆ యా వర్గాల తాత్త్వికదృష్టికోణంచెం నిదానించి చూస్తే స్పష్టమవుతూ ఉంటుంది. అవి రెండేరెండు దృక్పథాలు. ఒకటి కార్మికవర్గ దృక్పథం, రెండోది దోపిడీ వర్గాలయిన బూర్జువా భూస్వామ్య వర్గాల దృక్పథం. కార్మిక వర్గం కట్టకడపటిది. ప్రధానమైనది. ప్రజలకగ్రగామియైనది. అందరి అభ్యుదయానికి మూలకందమైనది. జాతులకతీతమైనది. అంతర్జాతీయం, విశ్వజనీనం అయినది. కనుక కార్మికవర్గ ప్రయో జనాల్ని దృష్టిలోపెట్టుకొనే ఏ సమస్యనైనా తరచిచూడాలిసి ఉంటుంది. అంటే మాటవరసకి అందరి అభ్యుదయాన్ని దృష్టిలో

బెట్టుకోవడమన్నమాట. 'ప్రపంచపౌరత్వం' (కాస్మాపాలిటనిజం) వగైరా నినాదాలు యిలాంటి సరియైన అంతర్జాతీయ దృష్టితో చేసేవికావు. అవి పెట్టుబడిదారీ ప్రభుత్వాల నిలాగే కదలకుండా అట్టిపెట్టి, వసుధైక బూర్జువా ప్రభుత్వాన్ని స్థాపించాలని కోరే వాళ్ళ బూటకపు బూర్జువా వర్గ నినాదాలు మాత్రమే.

ఈనాటివరకూ మానవసమాజం గానిస భూస్వామ్య బూర్జువావ్యవస్థల్లో సంపాదించిన పరిజ్ఞానం, సాధించిన సంస్కృతీ మన వివేచనాశక్తి నెంతో అభివృద్ధిజేస్తాయి. అంచేత ప్రతి రచయితా తప్పకుండా అవి జీర్ణంజేసుకోవాలి. తత్ఫలితంగా మన బుద్ధి వికసిస్తుంది. విచక్షణాదృష్టి విశాలమవుతుంది.

నేడు మనల్ని అనేక క్లిష్టసమస్య లెదుర్కొంటున్నాయి. వాటిని పూర్తిగా పరిష్కరించడానికి పూనుకోకుండా, తమవర్గ ప్రయోజనదృష్టితో బూర్జువానాయకులు వాటిని మరింత క్లిష్టతరం జేస్తున్నారు. దినదినాభివృద్ధిబొందుతూన్న వర్గపోరాటాలపై నీళ్లు చల్లుతున్నారు. వాటిని దారుణనిర్బంధాలతో అణచివేస్తున్నారు. ప్రజాశక్తులపై విరోధభావంవహించి సామ్రాజ్యవాదుల చెలిమికి అర్రులు చాస్తున్నారు. అత్యవసరమైన, అభ్యుదయకరమైన ప్రజా సమస్యల నెన్నిటినో అడుగున బడవేస్తున్నారు.

కనుక యువకులం, రచయితలం ప్రజల బిడ్డలమైన మనం చొరవతో యీ ప్రముఖ సమస్యలనన్నిటినీ శాస్త్రీయంగా అర్థం చేసుకొని పరిష్కరించాలి. అంతేగాదు. ప్రజాహృదయాన్ని తెలుసుకొని వారి కష్టసుఖాల్లో నాయకత్వంవహించి ముందుకు నడపవలసిన బాధ్యత మనమీదనే ఉంది.

౪

# వివిధ దృష్టికోణాలూ - పద్ధతులూ

ప్రతి సమస్యనూ వివిధ దృష్టికోణాలనుంచీ చూడాలి. సాధారణంగా చాలమంది ఏదో ఒక కోణంనుంచీ మాత్రమే ముఖ్యంగా చూస్తుంటారు. అంచేత సమస్యను సమగ్రదృష్టితో చూడలేక సమన్వయదృష్టి లేక తమకు కలిగేవన్నీ నిజంగా సమన్వయింపరాని భేదాలు అనే తలుస్తుంటారు. ఒకే వస్తువుయొక్క ఒకొ్కక భాగాన్ని మాత్రమే చూడ్డంవల్ల కలిగిన భేదాభిప్రాయాలివి. ఇది గ్రుడ్డివాళ్ళు నలుగురు ఏనుగును చేతులతో తలొక అవయవాన్ని తడివి ఏనుగంటే చేటలాంటిదని ఒకరూ, చీపురులాంటిదని మరొకరూ, రోలునంటిదని వేరొకరూ, రోకలివంటిదని యింకొకరూ వాదించుకొన్నట్లు ఉంటుంది. ఇది వస్తువుయొక్క పూర్ణజ్ఞానం లేనందువల్ల కలిగినఫలితం. కాని అట్టిజ్ఞానం కొంతవరకు ఉండికూడా రెండు పరస్పర విరుద్ధవర్గాలకు సంబంధించినవాళ్లు ఒక సమస్యను తమతమ వర్గప్రయోజన దృష్టితో జూచినందువల్ల కలిగే అభిప్రాయభేదాలు వేరు. పై విధంగా ఒక వర్గంవారికే పూర్ణవస్తు పరిజ్ఞానం లేనందువల్ల కలిగే అభిప్రాయ భేదాలు వేరు.

కనుక, ప్రతి సమస్యనూ అన్ని దృష్టికోణాలనుంచీ చూడగల పరిజ్ఞానాన్నీ సౌకర్యాన్నీ, పూర్ణవిశాల దృష్టినీ అలవర్చుకోవాలి. అలాగే, ఒకవ్యూహం (స్ట్రేటజీ)లోనే ఒకొ్కక సమస్యను పరిష్కరించడానికి పరిస్థితులననుసరించి అనేక పద్ధతులూ, ఎత్తుగడలూ (టాక్టిక్సు) అవలంబించాలిసి ఉంటుంది. అవి చట్టబద్ధమైనవీ (లీగల్) గావచ్చు. చట్టవిరుద్ధమైనవీ (ఇల్లీ

గల్) గావచ్చు. కొంతమంది ఇందులో ఏదో ఒక పద్ధతినీ, ఎత్తు గడనే ఎంచుకొంటారు. ఒకదానిమీదనే తమకృషినంతా కేంద్రీకరిస్తుంటారు. అందువల్ల ఫలితం ఆలస్యంగానచ్చు. అసలే కలుగకపోవచ్చు. లేక అది ఎదురుతిరగవచ్చు. కనుక ఆయా పరిస్థితులననుసరించి ఆయా పద్ధతులను అవలంబించడంలోనే మన బుద్ధికుశలతా, రాజకీయవిజ్ఞతా స్పష్టమవుతాయి. అయితే ఎట్టి పరిస్థితుల్లోనూ అసలు మూలసిద్ధాంతానికీ, అప్పటి వ్యూహానికీ భిన్నంగానూ, అపకారంజేసేదిగానూ ఎంతమాత్రం మనం అవలంబించే పద్ధతి, ఎత్తుగడా ఉండరాదు. మొదలుకే మోసం గారాదు. "ఉండనాలుకకు జెడితే కొండనాలుక ఊడిపోయిం" దన్న సామెత వ్యవహారం గారాదు. కనుక అన్ని పద్ధతులలోనూ అన్ని ఎత్తుగడలలోనూ, అన్నిరంగాలలోనూ, అన్నివైపులనుంచీ, అన్నిముఖాలనుంచీ శత్రువర్గాన్ని ఎదుర్కోడమే నేడు మనందరి కర్తవ్యం.

## విప్లవ పరిస్థితుల అంచనా

కార్యవాదులైన వారిలా పరిస్థితుల్ని అనుసరించి తమ వ్యూహాన్నీ, ఎత్తుగడలనూ, పాలసీని, పద్ధతులనూ మార్చుకోడాన్ని కొంతమంది అర్థంలేని ఆరోపణలతో నిందిస్తుంటారు. ఒక పరిస్థితిలో అవలంబించిన పాలసీని; పద్ధతినే ఎల్లప్పుడూ అవలంబించాలనడం వారి అనుభవ రాహిత్యాన్ని, గతి తార్కిక భౌతిక వాదానభిజ్ఞతనూ మాత్రమే తెలియజేస్తుంది. అలాగే ఒకే పద్ధతిని ఎల్లప్పుడూ అవలంబించడం వల్ల అసలు సమస్యా పరిష్కారం జరక్కపోగా విషమిస్తుంది గూడా. బూర్జువా రాజకీయ

వేత్తలు సయితం పరిస్థితుల ననుసరించి తమకున్న పరిజ్ఞానంతో తమ వ్యూహాన్నీ, ఎత్తుగడలనూ, తమ పాలసీని, పద్ధతినీ మార్చుకొంటూనేఉండడం మనం చూస్తూనేఉన్నాం. అయితే, పరిస్థితులకు కొట్టుకుపోయి ముఖ్యసిద్ధాంతాన్ని త్రోసి పుచ్చగూడదు గూడా. కేవలం తాత్కాలిక పరిస్థితులకూ, తాత్కాలిక ప్రయోజనాలకూ లోబడి శాశ్వత ప్రయోజనాలను బలి యివ్వరాదు.

సమస్యను వివిధదృష్టి కోణాలనుంచీ చూచి అర్థం చేసుకోవాలంటే ముఖ్యంగా సర్వతోముఖ పరిజ్ఞానం అవసరం. అంతకు మించి లోతైన, ఢక్కా మొక్కీలు తిన్న జీవితానుభవం కావాలి. తన జాతియొక్క ఆచార సంప్రదాయాలలోని మంచి చెడ్డల్నీ, జీవిత విధానాల్నీ పూర్తిగా అవగతం చేసుకోవాలి. ఆయా దృష్టి కోణాలను, ఆయా పరిస్థితులకు సమన్వయంచేసి చూచినప్పుడే ఆసమస్యను పరిష్కరించడానికి అనుసరించవలసిన పద్ధతి బోధపడుతుంది. అప్పటి విషమ పరిస్థితుల నెదుర్కొనే సాహసం గూడా అప్పుడే కలుగుతుంది.

కమ్యూనిజం వివిధ దృష్టి కోణాల్లో ఉన్న మంచినీ తీసుకొంటుంది. చెడును వదిలేస్తుంది. అందుచేతనే అది ఉత్తమోత్తమమైన జీవిత విధానమైనట్లే అది ఆదర్శంగా పెట్టుకొన్న విమర్శా విధానం గూడా తదితరమైన అన్నిటికంటె ఉత్తమోత్తమమైనదే అవుతుంది. మానవజాతి యింతవరకు ఆయావ్యవస్థల్లో ఆర్జించిన విజ్ఞానంలోని చెడును త్రోసివేసి మంచినంతా విమర్శాదృష్టితో ఎంచుకొని, దాన్ని అంగీకరించు కొంటుంది. నూతన దృక్పథంతో సమున్నత విశాలాదర్శంతో ముందుకు

సాగిపోతుంది. ఆదర్శం ఉన్నతమైనదీ, విశాలమైనదీ అయినప్పుడు అది చేరుకోడానికి ఎంచుకొన్న దృక్పథంగూడా ఎప్పుడూ ఉన్నతమైనదీ, విశాలమైనదిగానే ఉంటుంది.

కమ్యూనిస్టు మూలసిద్ధాంతకర్తలు మార్క్సు ఏంగెల్సులు చేసినపని అదే. లెనిన్ స్టాలిన్ మావోలదే అనుసరించారు. నూతనపరిస్థితుల ననుసరించి ఆ సిద్ధాంతాన్నెంతో అభివృద్ధిచేయగలిగారు. నేడు వివిధదేశాల్లోని బాధ్యతగలిగిన విఖ్యాతకమ్యూనిస్టు నాయకులు చేస్తున్నపనిగూడా అదే. తప్పులు చేసినవాళ్లూ, పొరపాట్లు బడినవాళ్లూ, నిర్మొహమాటంగా నిశితంగా తమ తప్పిదాలనూ పొరపాట్లనూ విమర్శించు కొంటున్నారు.. పెద్ద తప్పులుచేసినవాళ్లు తమ పదవులనుంచీ తొలగించబడుతున్నారు.

ప్రతి సమస్యనూ వివిధ దృష్టికోణాలనుంచీ చూడగలిగి ఉండడంఅంటే అది ఎంత గొప్పనాయకులకైనా ఒక్కరికి చాలా కష్ట సాధ్యమైన పనే అవుతుంది. కనుక, అందుకు ప్రజలందరి సహకారం అవసరం. ప్రజలకు బోధించేవాళ్లెప్పుడూ ప్రజలనుంచి నేర్చుకోడం అవసరం. ముఖ్యంగా పార్టీలోని రచయితల మేధావుల సహకారం ఎంతో ఉపయోగిస్తుంది. పార్టీవిధానం కళాదృష్టిలోనూ, శాస్త్రదృష్టిలోనూ నిర్దుష్టంగానూ, నిశితంగానూ ఉండాలంటే సృజనాత్మకమైన వీరి కృషిని సహకారంగా తీసుకోడం తప్పనిసరి. ఇలా వివిధప్రజల అభిప్రాయాలను సేకరించడం ఒక్క కార్మికవర్గ పార్టీలోనే జరుగుతుంది. సాధ్యమవుతుంది గూడా. అందుచేతనే కేంద్రీకృత ప్రజాస్వామిక విధానం (డెమాక్రటిక్ సెంట్రలిజం) ఒకకొత్తపద్ధతీ, శక్తివంతమైన విధానంఅయింది.

బూర్జువా పార్టీలకూ కమ్యూనిస్టు పార్టీకీ, బూర్జువా రాజకీయ వేత్తలకూ కమ్యూనిస్టు రాజకీయవేత్తలకూ గల ప్రధానమైన భేదం యిందులోనే ఉంది.

ఒకరు నశించిపోయే వర్గం తాలూకు ప్రయోజనాల నంటి పెట్టుకొని దానిని నిలబెట్టాలంటారు. రెండవవారు నానాటికి వర్ధిల్లుతున్న అందరి అభ్యుదయానికీ వెలుగుచుక్కయైన కార్మిక వర్గం తాలూకు ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొని వాటి కోసం తమ శాయశక్తులా పోరాడుతారు.

## భౌతిక జగత్తుకూ - మేధావి జగత్తుకూ పొత్తు

బూర్జువా సంస్థల్లో ఒకే నాయకుడు లేక పైనాయకత్వం గానీ, ప్రజానీకం కోర్కెలతో నిమిత్తం లేకుండా ఒక విధమైన నిరంకుశత్వం సాధారణంగా అమలుపర్చడం జరుగుతుంది. ఇందుకు ఏకగ్రీవంగా ఆంధ్ర ప్రజలందరూ గాఢంగా వాంఛించిన ఆంధ్రరాష్ట్రాన్ని బూర్జువా వర్గ ప్రయోజనంకోసం పటేల్ నెహ్రూలు ఒక్కగీటుతో త్రోసివెయ్యడాన్ని మనం ఉదాహరణగా తీసుకోవచ్చు. పైగా యీ సంస్థల్లో ఒక సిద్ధాంతఐక్యత తాత్త్విక ఐక్యత ఉండదు. నాయకత్వం సంపాదించిన కొద్దిమంది యొక్క లేదా, ఒక్కనియొక్క తాత్త్విక దృక్పథమే తమను గ్రుడ్డిగా అనుసరించే ప్రజానీకం మీద అది వారికి ఉపయోగించినా సరే ఉపయోగించకపోయినా సరే, సిద్ధాంతానికి, ఆచరణకు సంబంధము బొత్తిగా లేకపోయినా సరే, వారికి వ్యతిరేకమైనా సరే రుద్దు తుంటారు. అందేత తాము ప్రతినిమిషమూ చిలక పలుకుల్లాగా వల్లిస్తుండే లక్ష్యాన్ని సాధించడానికే తమ సిద్ధాంతాలూ తాము తీసుకునే చర్యలు ఉపకరించక పోగా అపకారం గూడా చేస్తుం

టాయి. సిద్ధాంతాలకు ఆచరణలకు సాధారణంగా సంబంధం ఉండదు. సిద్ధాంతాల్లో పరిపక్వత ఉండదు. పరస్పర వైరుధ్యం ఉంటుంది. దూరదృష్టి, సర్వతోముఖత్వం ఉండవు. ఎప్పటి కప్పుడు ప్రాప్తకాలజ్ఞత మాత్రమే ఉంటుంది. ప్రజల ఆశయసిద్ధి పూర్తిగా జరిగేదాక పోరాటం కొనసాగించేకంటె తమ స్వ ప్రయోజనాలకోసం ప్రజలకు ద్రోహంచేసి రాజీలకు ప్రాకు లాడడంలోనే ఆసక్తి మెండు. 1947 ఆగస్టు 15 న అది విస్పష్ట మయింది. ఇవన్నీ దాదాపు పైవర్గాల ప్రయోజనాన్ని మాత్రమే దృష్టిలో పెట్టుకోవడం వల్ల కలుగుతూన్న దుష్ఫలితాలని వేరే చెప్పక్కర్లేదు. అదీగాక శాస్త్రీయదృష్టితో రాజకీయాలను అర్థం చేసుకోవడం ఉండదు. మూఢవిశ్వాసాలమీదా, మత విశ్వాసాల మీదా ఆధారపడుతుంటారు. అందుచేత కేవల అనుభవ వాదం (ఎంపిరిసిజం) హెచ్చుగా ఉంటుంది. రాజకీయాలకూ, కళా శాస్త్ర వాఙ్మయాలకూ ఉన్న సంబంధాన్ని శాస్త్రీయ దృష్టితో చక్కగా సమన్వయించుకోవడం ఉండదు. అవి అవే, ఇవి ఇవే అనే వేరుబడి పోయిన దృష్టి హెచ్చుగా ఉంటుంది. ఖచ్చిత మైన తాత్వికదృష్టి లేకపోయే టప్పటికి భౌతిక జగత్తుకూ మేధావి జగత్తుకూ పొత్తు కుదర్చలేరు.

కార్మిక వర్గ పార్టీలో పైదానికి పూర్తిగా వ్యతిరేకంగా ఉంటుంది. క్రిందినుంచీ పైకి ఖచ్చితమైన ప్రజా స్వామ్యాన్ని అనుసరించడం ఉంటుంది. పై కమిటీల నిర్ణయాలకు క్రింది కమి టీలు కట్టుబడి ఉన్నా క్రింది కమిటీలు పై కమిటీలకు తమ రిపో ర్టుల ద్వారా ఎప్పటి కప్పుడు బోధిస్తూ, మార్గం చూపిస్తూ ఉంటాయి. పై కమిటీల రిపోర్టులు, సర్క్యులర్లు, డాక్యుమెంట్లు

ద్వారా బోధించబడుతూ మార్గం చూపించబడుతుంటాయి. ప్రజలు పార్టీ నాయకుల్నీ పార్టీ నాయకులు ప్రజల్నీ ఎప్పటి కప్పుడు పరస్పర కర్తవ్యాన్ని బోధించుకొంటూ ఉంటారు. చైతన్యంపొందిన ప్రతికార్మికుడూ తనపార్టీ పాలసీని రూపొందించు కోవడంలో తోడ్పడుతూ ఉంటాడు. కనుకనే తనపార్టీ పాలసీని తన పాలసీగా చైతన్యంతో ఆచరణలో పెట్ట గలుగుతాడు.

కళాకారులు, శాస్త్రవేత్తలు, చరిత్రవేత్తలూ మొద లయిన వివిధ దృక్కోణాలతో చూడగలిగిన, బహువిధ శక్తి సామర్థ్యాలుగల వ్యక్తులున్నప్పటికీ వారికి సంబంధించిన దృష్టి కోణాలను, శక్తి సామర్థ్యాలను మేళగించుకోడాని కవకాశం ఉంటుంది. అన్ని దృష్టి కోణాలలోనూ విషయాన్ని పరిశీలించి అన్నిట్లోని మంచినీ తన విధాన కార్యక్రమాల (పాలసీ అండ్ ప్రోగ్రామ్) లో లీనం చేసుకోడం కార్మిక నాయకత్వం యొక్క లక్షణం. అలాంటి అవకాశం ఏబూర్జువా సంస్థల్లోనూ ఉండదు. ఒక్క కార్మికవర్గ పార్టీలోనే ఉండడానికి వీలుంటుంది. కార్మికవర్గ పార్టీలో అందరికీ ఒకే ఉన్నతాశయంగాబట్టి ఆశయంలో ఎలాంటి వైరుధ్యమూ ఉండదు. ఎత్తుగడల్లో భేదాభిప్రాయం ఉండవచ్చు.

కేవల కళాదృష్టితో గానీ, కేవల శాస్త్రదృష్టితో గానీ, కేవల సాహిత్య దృష్టితోగాని జీవిత సత్యాన్ని అన్వేషించగలం. అంగీకరించుకోగలం. కాని, అది పూర్ణసత్యం కాలేదు. ఖండసత్యం మాత్రమే అవుతుంది. సత్యం యొక్క ఒకకోణం, ఒకభాగం, ఒక స్వరూపం మాత్రమే అవుతుంది. అన్ని కోణాలనుంచీ, అన్ని వైపులనుంచీ చూచినప్పుడే పూర్తి జీవిత సత్య స్వరూపం బహి ర్గతం (విశ్వరూప సందర్శనం) కాగలదు.

# సాపేక్ష సత్యాలు - పరిపూర్ణ సత్యం

[ రిలెటివ్ ట్రూత్స్ అండ్ అబ్సల్యూట్ ట్రూత్ ]

అందుకనే, సంస్కృతి పొందని ఒక వ్యక్తి గూడా జీవిత సత్యాన్ని గాంచవచ్చు. కాని, అది స్పష్టంగా ఉండకపోవచ్చు. సత్యలేశమో, అర్ధ సత్యమో కావచ్చు. పూర్తి సత్యం గాక పోవచ్చు. పూర్తి జీవిత సత్యాన్ని స్పష్టంగా చూడగలవాడే నిజమైన తత్వవేత్త. నిజమైన శాస్త్రవేత్త. నిజమైన కళావేత్త. నిజమైన రాజకీయవేత్త. ఏంగెల్సు చెప్పినట్లు సాపేక్ష సత్యాల నుంచి పరిపూర్ణసత్యంఏర్పడుతుంది. కాబట్టి కళగానీ, శాస్త్రం గానీ, సాహిత్యంగానీ, రాజకీయాలుగానీ పూర్తిగా ఒకదానితో ఒకటి ఏ మాత్రమూ సంబంధం లేకుండా విడివిడి (ఐసలేటెడ్) గా ఉండ జాలవు. సాహిత్యం గూడా ఒక కళ, ఒక శాస్త్రమూ అవుతుంది. శాస్త్రంగూడా ఒక కళా, సాహిత్యమూ అవు తుంది. సాహిత్యం కళాశాస్త్రాలసమ్మేళనం. రెండింటి సారాంశం.

వివిధ శాస్త్రాలూ, కళలూ, సాహిత్యమూ ఒకే జీవిత విషయాన్ని, సత్యాన్ని, లక్ష్యాన్ని సమస్యలను వివరించడంలో పరిష్కరించడంలో వివిధదృష్టి కోణాలూ (వేరియస్ పాయింట్స్ ఆఫ్ వ్యూ) విభిన్న రూపాలూ (డిఫరెంట్ ఫారమ్స్) మాత్రమే.

ఒక సమస్యను సరిగా, సమగ్రంగా అర్థం చేసుకోవడం అంటే యీ అన్నిదృష్టికోణాలనుంచీ చూచి సమస్యయొక్క పూర్తి స్వరూపాన్ని, పుట్టుపూర్వోత్తరాల్ని అవగాహన చేసు కోవడం అన్నమాట. కమ్యూనిజం అలా అవగాహనచేసుకొంటుంది. కళాకారుల, సాహిత్య శాస్త్రవేత్తల సహాయంతో వారందరి దృష్టికోణాలనుంచీ సమస్యలను సమగ్రంగా చూడగలుగుతుంది.

అందుకని, కమ్యూనిస్టు విమర్శ సాధారణంగా పూర్ణసత్యానికి చేరువగా ఉంటుంది. వర్గసమాజంతో బాటు సత్యంలోని పాక్షికత్వం అంతరించి పూర్ణత్వం ఆవిర్భవిస్తుంది.

## సమగ్రత సంభవమే!

అయితే సమగ్రత, పరిపూర్ణత (పర్ ఫెక్షన్) అనేది ఏ జీవితంలోనైనా, ఏ వ్యక్తికైనా, ఏ సిద్ధాంతంలోనైనా సిద్ధించడం ఎప్పుడైనా సంభవమేనా? అనేది ఒక ప్రశ్న. పూర్తి అర్థంలో అది అసంభవమే కావచ్చు.

కాని, ప్రత్యేక పరిస్థితుల్లో-ప్రత్యేకసమస్యల విషయంలో మాత్రం ఆనాటికి సమగ్ర పరిజ్ఞానం సంపాదించవచ్చు. సంపూర్ణ పరిష్కారం సాధించవచ్చు.

మార్క్స్ మహాశయుడు ఆనాటి ఆర్థిక రాజకీయ సాంఘిక వైజ్ఞానిక పరిస్థితుల్లో ఆయా సమస్యలమీద సమగ్ర పరిజ్ఞానాన్ని సంపాదించాడు. అంచేత ఆ పరిస్థితుల్లో ఆయన పరమ ప్రామాణికుడు (ఫైనల్ అథారిటీ) కాగలిగాడు. ఒక ప్రత్యేక పరిస్థితిలో ఒక ప్రత్యేక సమస్యమీద యిలా ప్రామాణ్యతగల ఉత్తమ రచన (క్లాసిక్) ఆ పరిస్థితి పూర్తిగా మారనంతవరకూ, ఆసమస్య పూర్తిగా మారనంతవరకూ, ఆ సమస్య పూర్తిగా పరిష్కరించబడనంతవరకూ ప్రమాణంగానే ఉంటుంది. అంతేకాదు. చాలవరకు అది త్రికాలీయం అని చెప్పవచ్చు. నూతన పరిస్థితుల వెలుగులో నూతన సమస్యల వైరుధ్యాల ఆవిర్భావంతో, అట్టి రచనల్లోని సిద్ధాంతాల్లో గతంలో కనుమరుగై ఏవైనా పొర

పొట్లుంటే అవి స్పష్టంగా దృగ్గోచరమవుతాయి. కనుక పరిస్థితుల
మార్పుతోబాటు సమస్యల్లోనూ, సమస్యల నర్థంచేసుకొ
పద్ధతుల్లోనూగూడా తిరిగి మార్పు ఉంటుంది. గతంలో పొరపా
ట్లుగాతోచినవి ప్రస్తుతం సరిదిద్దుకోబడతాయి. మార్క్సిజాని
లెనినిజం అలాంటి అభివృద్ధికరమైన మార్పు. లెనిన్ అనంతర
స్టాలిన్ జీవితం, స్టాలిన్ కృషీ సమగ్రమైనవని పేర్కొనవచ్చు.

కనుక బూర్జువా కళాశాస్త్ర వాఙ్మయాలు అర్ధమానవ
త్వాన్నీ, అర్ధమేధావితనూ మాత్రమే ప్రతిపాదించి వాటిని
ఆదర్శంగా తీసుకొంటే, కమ్యూనిజం పూర్ణ మానవత్వాన్నీ
పూర్ణ మేధావితనూ సృజించి అవే పరమాదర్శంగా పురోగ
మిస్తోంది !

1946

## మనసు ఫౌండేషన్

### పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA 106 B 110 |
| పుస్తకం పేరు | కేయూరబాహుచరిత్రము - అవతారిక [illegible] |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 77 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Hema |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | Mounica |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | no |
| పరిస్థితి | Good |